

Chandamama, September '50

Photo by A. L. Syed

అద్దంతో ముద్దులు



# నరసూస్
# కాఫీ పొడి

మీ ప్రియమైన పానీయం

## ఇప్పుడు
## అన్ని చోట్లా
## దొరకును

శ్రేష్ఠమైన ప్లాంటేషన్ పిబెరీ,
ఎక్ట్స్రా బోల్డు కాఫీ గింజలు

7 పౌనులు, 3 పౌనులు, 1½ పౌను, ¾ పౌనుగల

సీలు చేయబడిన గుడ్డ సంచీలలో దొరుకును.



**నరసూస్ మాన్యుఫాక్చరింగ్ కో., లిడ్, సేలం**

**FOR PLEASANT READING &**
**PROFITABLE ADVERTISING :**

# Chandamama Group

**(HINDI, TELUGU, TAMIL & KANNADA)**

**EVERY MONTH ADORNS**
**85,000 HOMES**

*and*

*Enchants Ten Times the*
*Number of Readers*
*throughout India*



**Group Page Rs. 350**



*Enquire :*

**P. O. BOX 1686, MADRAS-1**



## డోంగ్రేగారి

### బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్నూ,
పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనముల
నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co., BOMBAY-4

## 'చందమామ' కు
## ఏజంట్లు కావాలి



ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలుకూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తివివరాలకు ఇలా వ్రాయండి.

**చందమామ ఆఫీసు,**
పోస్టుబాక్సు నెం. 1686, మద్రాసు-1

## నాలుగు భాషలలో
# చందమామ



**(తెలుగు) చందమామ**

విడిసంచిక 0-6-0
సాలుచందా : 4-8-0
రెండేండ్లకు : 8-0-0

**(కన్నడ) చందమామ**

విడిసంచిక 0-6-0
సాలుచందా : 4-8-0
రెండేండ్లకు : 8-0-0

**(హిందీ) చందమామ**

విడిసంచిక 0-6-0
సాలుచందా : 4-8-0
రెండేండ్లకు : 8-0-0

**(అరవ) అంబులిమామ**

విడిసంచిక 0-6-0
సాలుచందా : 4-8-0
రెండేండ్లకు : 8-0-0

చందమామ పబ్లికేషన్స్
పోస్టు బాక్సు 1686 :: మద్రాస్ - 1

# ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెని, లిమిటెడ్

ప్రధాన కార్యాలయం : మచిలీపట్నం.

"ఆంధ్ర" పురోగమనములో మరొక అపూర్వఘట్టము.

**1949 లో నూతన వ్యాపారము**

| | |
|---|---|
| సేకరింపబడినది | .... రు. 2,02,00,000 |
| పట్టాలుగా మారినవి | .... రు. 1,64,00,000 |

**1950 మా రజతోత్సవము**

**మా లాభములలో పాల్గొనుడు**

జీవిత భీమాతోపాటు అగ్ని, మోటారు, నౌకా ప్రమాదములకు పట్టాలివ్వబడును.

మా మద్రాసు ఆఫీసు : 337, తంబుచెట్టి వీధి, మద్రాసు.

ఇండియా అంతటను మా ఆఫీసులు గలవు.















# రు. 500 బహుమానము

## ఉమా గోల్డు కవరింగు వర్క్సు

ఉమా మహల్ :: మచిలీపట్నము

ఉమా గోల్డు కవరింగు వర్క్సు పోస్టాఫీసు.

అసలు బంగారు రేకు లోహముపైన అంటించి (Gold Sheet Welding on Metal) తయారు చేయబడినవి. కాదని ఋజువు చేసినవారికి రు. 500 బహుమానమివ్వబడును. మేము తయారు చేయు ప్రతివస్తువు ప్యాకింగు పైన "ఉమా" అను ఇంగ్లీషు అక్షరములు గుర్తించి కొనవలెను. బంగారు వన్నె 10 సంవత్సరములు గ్యారంటీ.

* * *

పరీక్ష చేయగోరువారు ఉమా ఆభరణములను మహాద్రావకములో వేసిన 5 నిమిషములకే బంగారము రేకు వెడలివచ్చును. ఈ విధముగా పరీక్ష చేసినవారు అనేకమంది మాకు సర్టిఫికేట్లు ఇచ్చియున్నారు. 800 డిజయినులు గల క్యాటలాగు ఉచితముగా పంపబడును. ఇతర దేశములకు క్యాటలాగు ధరలమీద 25% అధికము.

*N.B.*—వస్తువుల వి. పి. పార్శిలు చార్జి 0-15-0 మాత్రమే అగును.

Tel: "UMA" MASULIPATAM.

# అట్టమీది బొమ్మ

కృష్ణుడినీ, బలరాముణ్ణీ ఎలా ఐనా హతమార్చాలెనని కంసునికి తాపత్రయం పట్టుకున్నది. ఈ దీక్షతోనే, ధనుర్యాగం అనే మిషమీద వారిద్దరనూ మధురకు వెంటబెట్టుకరమ్మని అక్రూరుణ్ణి పంపిన సంగతి మీకు యిడివరకే తెలుసు.

వాళ్ళను రప్పించాడే కాని, తీరా కృష్ణ బలరాములు వచ్చారనేవార్త చెవిని పడేసరికల్లా అతనికి చెప్పరాని మనోవేదన పట్టుకొన్నది. ఏమిచేదామన్నా పాలుపోయిందికాదు. అందుచేత 'యాగంకోసం జరిగిన యేర్పాట్లన్నీ నేను చెప్పినట్టుగా ఉన్నాయో లేదో చూచిరావాలి' అనుకొని బయల్దేరి మతిలేనివానిలాగా పట్టణమంతటా తిరుగులాడసాగాడు.

కంసుని అజ్ఞప్రకారం 'కువలయపీడనం' అనే భయంకరమైన ఏనుగను సిద్ధంచేసి, కోటద్వారంవద్ద నిలబెట్టి వుంచాడు మావటీడు. ఇంతలో కృష్ణబలరాములు వినోదార్థమై కోటకు వచ్చారు. వారు రావటమే తడవుగా మావటివాడు ఆ యేనుగును వారిపైకి తోలబోయినాడు. 'వద్దు, వద్దు' అంటూ చిన్నారి కృష్ణుడు ఎంతగా మందలించినప్పటికీ ఆ మాట మావటివాని చెవికి ఎక్కలేదు.

అప్పుడు కృష్ణ బలరాములు, ఆ ఏనుగయొక్క కాళ్లు నాలుగూ స్తంభాలుగా చేసుకుని, దాగుడుమూతాలాట ఆరంభించారు. తన కాళ్ళకిందనే దాక్కున్న మాయలకృష్ణుడు ఏనుగకు అందినట్టే కనపడేవాడు, కాని దొరికేవాడు కాదు. అతనిని పట్టవలెననే ప్రయత్నంలో ఏనుగా మావటీడుకూడా అలిసిపోయారు.

చివరకు అవతారపురుషుడైన శ్రీకృష్ణుడు, కావాలని తనంతట తనే ఏనుగు తొండంలో చిక్కకొన్నాడు. ఇదంతా తనప్రజ్ఞే అనుకొని కువలయపీడనము అతనిని తొండంతో పైకంటా ఎత్తి, నేలనువేసి కొట్టబోయింది. కాని, కృష్ణుడు తొండం గట్టిగా మెలిపెట్టి కుంభస్థలంమీద కూర్చుని, దాని దంతమే ఒకటి విరిచి అంకుశంగా ఉపయోగించి పొడవగా, యేనుగ పర్వతంలాగా నేలకూలి, పరమాత్మునిలో ఐక్యమైపోయింది! దాని జీవుడు పోయేటప్పుడు అది చేసిన ధ్వనికి మధురాపురి అంతా భూకంపం వచ్చినట్టుగా దద్దరిల్లిపోయింది. ఆ ఉదుటుకి 'ఇదేమిటా ఈ భీభత్సం!' అని కంసుని గుండె అదరజొచ్చింది !!

# చందమామ

పిల్లల కథల మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

వచ్చేది భాద్రపదమాసం.
భాద్రపద శుద్ధ చవితినాడు ఆదిదేవుడైన
వినాయకుడు ఎలుకవాహనంపైన ఇంటింటికీ వచ్చి,
ఉండ్రాళ్లు ఆరగిస్తాడుకదూ. ఆయన ఉండ్రాళ్లు తెగతినటం,
పొట్ట బ్రద్దలవటం, చందమామ అతన్నిచూచి నవ్వి శాపగ్రస్తుడు
కావటం ఈకథలే మనం అస్తమానం చెప్పుకొని సంతృప్తి పడుతున్నాము.
ఐతే, గణపతి ఉత్త తిండిపోతుకాదు. అనేకమంది దుష్టరాక్షసుల్ని సంహ
రించి, లోకోపకారంచేసిన అవతార పురుషుడు. పార్వతీ పరమేశ్వరుల ముద్దు
లబ్బాయి. వినాయకుడి గుడి ఎదట గుంజిళ్లుతీసి, మొట్టికాయలు మొట్టుకునే
ఆచారం ఎక్కువగా దక్షిణాదిని కానవస్తుంది. ఈ ఆచారం ఎలా వచ్చిందో తెలిపేకథ
ఈ సంచికలోవుంది చదవండి. ఈసారి మీరు మద్రాసు వచ్చినప్పుడు ఈ విషయం
గమనించవచ్చు. మరొకచిత్రమేమిటంటే: గరుడపక్షికి పాములు ఎందుకు ఎరఅవు
తున్నవో ఆకథకూడా ఈసంచికలో చదువుతున్నారు. పాపం, పాముల బాధ అంత
టితో తీరలేదు. మన గణపతికి పొట్ట విచ్చిపోయినప్పుడు, రాసులుగా పడివున్న
ఉండ్రాళ్లు ఒక్కటైనా పైకిపోకుండా ఆయన పొట్టలో మళ్ళీ కుక్కిపెట్టి,
కుట్టటానికని పదివేల పాములను వెతికితెచ్చి, వాటిని తాళ్ళుగా
ఉపయోగించారట! వినాయకుని గురించి ఇలాటి గాథలు లక్షల
కొద్దీ ఉన్నాయి. వాటిని మనం తెలుసుకోవాలి. విఘ్నాలను
బాపే వినాయకుడు మన కోరికలను ఎల్లప్పుడూ
తీరుస్తాడని ఆశించుదాం.




సంపుటి 7
సంచిక 3

సెప్టెంబరు
1950




# ముఖస్తుతి

పూరి నగరమేలు రాజు
వొక్కరోజు మంత్రులంత
తోడరాగ వెడలినాడు
మసకవేళ కడలి చెంత.

ఇసుకలోన కూర్చుండిరి
రాజు దరిని సామంతులు
వారి ముందు కడలి అలలు
హెూరున వేసెను గంతులు.

అప్పుడు సామంతు డొకడు
పలికినాడు ఇవ్విధమున—
"ఓ రాజా! నీ కెవ్వరు -
సాటిగలరు ఈ జగమున?

నీ నామము చెప్పినంత
తల వంచును హరుడైనా!
నీ ఆనతి మీరలేడు
ఈ రత్నాకరుడైనా!"

రాజాతని ఈ పలుకులు
విని ఇచ్చకముల రోయుచు,
అతని అసత్యము లతనికి
నిరూపింప దలపోయుచు,

రచన:
'బైరాగి'

కడలి వైపు మరలి అనెను—
'తరగలార, ఆగండిక!
నా అనతి లేక మీరు
మునుముందుకు రాకండిక.'

కాని కడలి సుడులు తిరిగి
మునుపు వలెనె వడివడిగా
సాగి రాజు అడుగులకడ
విరిగెను నురుగుల జడిగా.

ఇదికని ఆ సామంతుని
మోము వెలవెలా బోయెను
తలవంచుకొనెను అతడు
నోటమాట రాదాయెను.

రాజాతనితో "ఎన్నడు
ఈరీతిగ పలుకకింక!"
అని లేచి వెడలిపోయె
నెమ్మదిగా నగరివంక.

స్వార్థపరులు చేయుచుంద
రీ రీతిగ ముఖస్తుతులు
వాటివలన మోసపోరు
ఎన్నటికిని ధీరమతులు.





# రోకంటి పాటలు

[ సేకరణ: వడ్లమూడి గోపాలకృష్ణయ్య ]

శుక్రవారంనాడు అక్క! పొద్దున్నె
సూర్యుడు జన్మించె తల్లి గర్భాన
ఆదివారం నాడు అక్క! పొద్దున్నె
అంబోతు జన్మించె ఆవు గర్భాన.

* * *

వరస గానివార్ని వరసాడబోతే
పురుషుడా నీ శిరసు ధరణి కొరిగేను
కానివారిని నీవు కారాడబోతే
కాముడా! నీ శిరసు కాటి కొరిగేను.

* * *

వడ్ల బత్తూడా! ఓరి నాయన్న!
వడ్డింపు కోసమని తెడ్డొక్కటియ్యి.
కమసాలి నాయన్న ఓరి నాయన్న!
కమ్మని నేతిలోకి గరిటొక్కటియ్యి.

* * *

అక్క నా నోములు అనుకూలమైతే
అప్పుడూ నేనెద్దు నందలాలెక్కి
గుబగుబా నే నెద్దు గుఱ్ఱాలనెక్కి
పరుగునా నే వత్తు పల్లకీనెక్కి.

* * *

నూకలా కూటికే లేదు సారమ్ము
ఒకతల్లి బిడ్డలకి లేదు వైరమ్ము.

* * *

పాపంబు చేసికొని బావిలో బడితే
పై మురికియేగాని పాపాలు పోవు.

పొద్దుపొడుపూ చుక్క అప్పమ్మ నాకు
పొడిసొచ్చె సూర్యుడు బావమ్మ నాకు
తెల్లవారేచుక్క తల్లెమ్మ నాకు
దేవేంద్రుడు శివభోగి తండ్రమ్మ నాకు.

* * *

అన్నలు గలదాని నక్కరో నేను
అటప్రాయమునాడు మాటపడియెరుగ
బావలు గలదాని పణతిరో నేను
బాలప్రాయమునాడు పనిచేసి యెరుగ.

* * *

తల్లిలేదూ చిన్న! దయలేదు చిన్న!
దారిద్ర్యకాపురము చేయలేను చిన్న!
చీకట్లకోణంలో నే నుండలేను
ఏరంత కాపురము నేనీదలేను.

* * *

తోడికోడల రావె తోడాడుదాము
పట్టి కోడలరావె పసుపాడుతాము.
తొక్కు తొక్కే వారి తోడికోడళ్లు
వాయి తీసేవారి వదిన మరదళ్ళు.

* * *

చేయెత్తి వేయని పోకేమిపోటు!
చేఫలము లేనోరి మాకేమిమాట!

* * *

వేళగానీ వేళ వాయెసినాను
వాడచేడియలార! తోడు రారమ్మ!-




త్రామరాడ గ్రామంలో తమ్మిరాజు అనే కోమటి ఒక సంతరోజున రాత్రి ఎనిమిది గంటల వేళప్పుడు చీడీమీద చతికిలబడి లబో లబో మని గుండెబాదుకోటం మొదలెట్టేడు. వీధిని పోతూన్న కరణంగవర్రాజు 'ఏం తమ్మిరాజూ, ఎందుకు అలా ఏడుస్తున్నావు?' అని అడిగేడు.

తమ్మిరాజు, 'ఇంతకంటే ఏంకావాలి బాబయ్యా? వారమంతా అమ్మగా వచ్చిన చిల్లర పోగుచేసి, నూరు రూపాయిలకు సరిపడా సంతకు పట్టుకెళ్లి, రూపాయి చిల్లరికి కానీచొప్పున మారకం పుచ్చుకుని అంతా రూపాయలుగా మార్చేశాను. కరుకుల్లాంటి నూరు రూపాయిలూ సంచీలో వేసి మూతి బిగించాను. మారకం డబ్బులు క్రింద వచ్చిన రూపాయి తొమ్మిదణాలూ పెట్టి దొండకాయలు, ఉర్లగడ్డ, వెల్లుల్లి, పచ్చిమిరప కొని తక్కిన సంచీలలో వేసి కట్టుకున్నాను. ఇటువైపు వచ్చే రెండెడ్ల ఖాళీబండి కనపడగా బండివాడితో మంచి మాటాడి సంచులతో బండెక్కేను. బండి మీద నాకు కునికిపాట్లొచ్చాయి. ఇల్లు చేరుకుని బండి డిగి ఒక్కొక్క సంచీనే అరుగుమీద చేరవేశాను. కూరలసంచీలు నాలుగూ ఉన్నాయికాని రూపాయిల సంచి మాత్రం కనపడలేదు. దిక్కుమాలిన బండి, దానిలో కూచోటానికి వేసిన తడికకు అన్నీ బొక్కలే' అనిచెప్పి, మళ్లీ ఒకమాటు 'గొల్లు' మన్నాడు.

గవర్రాజుగారు సానుభూతి కనపరుస్తూ "ఏ బొక్కలోంచో మూట జారి రోడ్డుమీద పడిపోయుంటుంది. ఒకపనిచెయ్యి. 'నా రూపాయిలసంచీ పోయింది. దాన్ని తెచ్చి యిచ్చినవాళ్లకి పది రూపాయిలు బహుమానం యిస్తాను' అని వెట్టివాడిచేత చాటింపు వేయించు. ఆపైన నీ అదృష్టం

బి. రుక్మిణి, మైసూరు




ఎలాగుంటుందో చూద్దాం" అన్నాడు. తమ్మిరాజు, 'పదిగాదు, పాతిక ఇచ్చుకో మన్నా ఇచ్చుకుంటాను! యేభై ఇచ్చుకో మన్నా ఇచ్చుకుంటాను!! నా సంచి నాకు దొరికితే అంతేచాలు' అన్నాడు. 'పది రూపాయలు ఇస్తానందూ, చాలు. ఆపైన నీకెంతతోస్తే అంత యివ్వవచ్చు' అన్నాడు కరణం.

మర్నాడు తెల్లవారటంతోనే ఏయే ఊళ్ల నుంచి ఐతే ఆ సంతకు జనం వస్తారో ఆ ఊళ్ళన్నింటిలోనూ తమ్మిరాజు తన రూపాయలసంచీని గురించి టముకు వేయించాడు.

సరిపల్లెగ్రామంలో అరుగుమీద కూచుని జంధ్యాలు వడుక్కుంటూన్న పాపయ్య శాస్త్రి ఆ చాటింపు వినటంతోనే లోపలకు వెళ్లి భార్యతో, 'ఏమేవ్, నిన్న నాకుదొరికిన రూపాయిలసంచి తామరాడ కోమటిదట. పట్టుకెళ్లి ఇస్తే పదిరూపాయిలు బహు మానంఇస్తాట్ట కూడాను. ఏదీ ఆసంచి? ఇలాతే ఇప్పుడేవప్పజెప్పి వస్తాను' అన్నాడు.

శాస్త్రిగారి భార్య జానమ్మ, 'ఏమిటీ? చేతికి చిక్కిన మూటను చేతులారా వప్ప గించి వస్తారా? ఎక్కడైనా విన్నామా, ఇలాటి విడ్డూరం?' అంపి. 'ఊరికే ఇస్తా ముటే? పదిరూపాయిలు బహుమతి వస్తుంపి అని చెప్పానుగా?' అన్నాడు శాస్త్రి. 'మీ తెలివి తేగలు తిన్నట్లుగానే ఉంది! గప్‌చిప్‌గా ఊరుకుంటే సంచెడు రూపాయిలూ మనవే కదుటండీ! ముష్టి పదిరూపాయి లెక్కువా? సంచెడు రూపాయి లెక్కువా?' అంది జానమ్మ.

'సొమ్ము ఎవరిదో తెలిశాక మనదగ్గర ఉంచుకోవటం దొంగతనం అవుతుంది. ఐనా, ఒకళ్ళ డబ్బు మన కెందుకు పోనిద్దూ. తే ఇలా తే, ఆ సంచీ. ఇచ్చి చక్కావస్తా' అన్నాడు శాస్త్రి.



'ఇదిగో పట్టుకెళ్ళండి' అంటూ జానమ్మ సంచీ తెచ్చి, శాస్త్రిముందు గిరవాటేసింది.

శాస్త్రి ఆ సంచీ పుచ్చుకుని తామరాడ చేరుకున్నాడు. "షావుకారుగారూ గోకవరంలో గోపీనాథరావు గారింట పెళ్లికి తొందరగా వెడుతూవుంటే రోడ్డుమీద యీ సంచి నా కాలికితగిలి, నేను బోర్లాపడ్డంత పనైంది. 'ఏమిటి చెప్మా?' అని తడిమి చూస్తే లోపల రూపాయిలలాగా గట్టిగా తగిలాయి. ఇవాళ ప్రొద్దున్నే మీ చాటింపు విన్నాను. మీ సొమ్ము మీకు వప్పచెప్పి బహుమానం పుచ్చుకుందామని వచ్చాను" అన్నాడు.

తమ్మిరాజు తన రూపాయల సంచీ కంట బడటంతోనే బ్రహ్మానందభరితుడయాడు. సంచీ మూతివిప్పి. రూపాయలన్నీ ఒకమాటు లెక్క చూసుకున్నాడు. నూరు రూపాయిలూ చెక్కు చెదరకుండా ఉన్నాయి. ఇంక బ్రాహ్మడికి బహుమతీ క్రింద వాటిల్లోంచి పదిరూపాయిలు తీసి ఇవ్వటమే తరవాయి. కాని తీరా సంచీ చేతికి చిక్కగానే ఆపదిరూపాయిలూ ఇవ్వటానికి మనసు వప్పిందికాదు! 'శాస్త్రుల్లుగారూ, ఈ సంచీలో నూటపదిరూపాయలుండాలి. లెక్కచూస్తే నూరే ఉన్నాయి! మీ బహుమానం పదీ మీరు ముందే తీసుకున్నట్టున్నారే!' అన్నాడు.

పాపయ్య శాస్త్రి ఆ పలుకులు విని నిర్ఘాంతపోయాడు. తమ్మిరాజు ఆయనను బుకాయించేసరికి, మారు మాట చెప్పలేక శాస్త్రి తిరుగుదారి బట్టేడు

వెళుతూవుండగా దారిలో కరణం గవర్రాజు ఎదురై, శాస్త్రిని పలకరించాడు. జరిగిన సంగతంతా శాస్త్రి ఆయనకు చెప్పగా విని గవర్రాజు షావుకారు చేసిన దగాకు ఉగ్రుడైపోయాడు. 'మునసబు దగ్గిర ఫిర్యాదు చెయ్యండి. మీ బహుమతీ

మీకు నించున్నపాటున ఇప్పించేస్తాడు. ఇంత దారుణమా మరిన్ని " అని సలహా చెప్పాడు.

అలానే శాస్త్రివెళ్ళి మునసబుతో ఫిర్యాదు చేశాడు. తామరాడ మునసబు చాలా తెలివైనవాడు. సంగతి సందర్భాలు వెంటనే గ్రహించేశాడు.

'తమ్మిరాజూ, ఈయనకు నీ వాగ్దానం ప్రకారం ఆ పదిరూపాయిలూ ఇచ్చెయ్యి' అన్నాడు. కోమటి వప్పుకోలేదు. 'నా సంచీలో నూటపది రూపాయి లుండాలి. నూరే ఉన్నాయిప్పుడు. మిగత పదీ ఈ బ్రాహ్మడు కొట్టేసి, మళ్ళీ బహుమతీ అంటున్నాడు. ఈయన కింక ఒక్క కానీ కూడా ఇవ్వనక్కర్లేదు' అని పాతపాటే మొదలెట్టేడు.

అప్పుడు మునసబు 'తమ్మిరాజూ!— ఈ బ్రాహ్మడు మూతికూడా విప్పకుండా తెచ్చిన సంచీలో నూరు రూపాయలేకదూ ఉన్నాయన్నావు?' అని అడిగాడు. 'చిత్తం బాబూ ఆయన ఎదుటనే లెక్కబెట్టేను' అన్నాడు షావుకారు.

ఇదివిని కరణంతో, 'గవర్రాజుగారూ వీళ్ళిద్దరూకూడా ప్రమాణికాలు చేసి చెబుతున్నారు గనక ఇద్దరిమాటా నమ్మవలసిందే. తమ్మిరాజు పోగొట్టుకొన్నది నూటపదిరూపాయలున్న సంచి. పాపయ్య శాస్త్రి గారికి దొరికినది నూరు రూపాయల సంచి. దీన్నిబట్టి శాస్త్రులుగారికి దొరికినది షావుకారు పోగొట్టుకొన్న సంచీ కాదని తేల్తోంది....శాస్త్రులుగారూ, ఈ సంచీని మీరు తీసుకుపొండి. నూరు రూపాయిల సంచీ పోయిందని ఎవరైనా వస్తే ఇచ్చేద్దురుగాని...తమ్మిరాజూ, వెళ్లు. నువ్వు పోగొట్టుకున్నా నంటున్న ఆ నూటపది రుపాయల సంచి ఎవరైనా ఎప్పటికైనా తెచ్చి ఇవ్వకపోతారా చూదాం' అని తీర్పు చెప్పేసి కచేరినించి వెళ్ళిపోయాడు.






## 3

[భూగృహంలో తన ముగ్గురు కుమార్తెలను దాచి, సంతోషంతో ఇంటిముఖం పట్టిన రాజు, గుండెలు బాదుకుని పెద్దపెట్టున ఏడుస్తూ మేడ చేరుకోవటమూ, అది చూచిన రాణీ, మొదలు నరికిన చెట్టులాగా నేలకూలడమూ వరకూ క్రిందటిసారి చదివారుకదా? ఆ తరవాత—]

చుట్టూ చేరిన పరిచారకులూ, దాస దాసీలూ, రాజుని ఓదారుస్తున్నారు. మూర్ఛ పోయిన రాణికి ఉపచారాలు చేస్తున్నారు. కొంత సేపటివరకూ అక్కడ చేరిన వారిలో ఎవరి ముఖానా కళా కాంతీ లేదు. ఈలోగా ఆస్థాన వైద్యుడు వచ్చి రాణికి ఒక ఔషధం ఇచ్చాడు. మరి కొంతసేపటి కల్లా రాణికి స్పృహ వచ్చింది. అప్పుడు రాజుకి కాస్తంత స్థిమితం చిక్కింది. తరవాత ఆస్థాన వైద్యుడు రాజుని అడిగే సరికి అయన ఇలా చెప్పసాగాడు.—

"అలవాటు చొప్పున దాసీలతోసహా పిల్లలని వెంట తీసుకొని మన తోటలో షికారుకు పోయాను. ఈ నాలుగేళ్ళలోనూ అమ్మాయిలు ఎన్నో గండాలు గడిచి బ్రతకటం కళ్ళారా చూచినవాడినే కనుక, ఎప్పటికప్పుడు ఎంతో జాగ్రత్తతో వుండటం అవసరమైంది. అందుకని, పిల్లలు యిల్లు వదలి బైటికి కదిలినప్పుడల్లా వాళ్ల వెంటనే నేనూ ఒక వందమంది సేవకులను వెంట బెట్టుకొని ఉండవలిసి వస్తున్నది. అలాగే యివాళకూడా తోటలో చుట్టూ వందమంది




సేవకులను కాపలావుంచి వాళ్ళమధ్య నేనూ, దాసీలూ అమ్మాయిలను వెయ్యి కళ్ళతో కనిపెడుతూనే వున్నాం. ఇంతలో ఒక పెద్ద సుడిగాలి వచ్చింది. ఆ సుడి గాలికి బ్రహ్మాండమైన దుమ్మురేగి మేము ఒక్కక్షణం కన్నుమూశాం. తిరిగి కన్ను తెరిచేటంతలో మూడు రాబందులు వచ్చి నా చిట్టితల్లులు ముగ్గురినీ ఎత్తుకుపోవడం కనిపించింది." అని యింకా ఏమో చెప్ప బోతుండగా రాణి 'హా' అంటూ విరుచుకు పడిపోయింది. తిరిగి పరిచారికలు ఉపచా రాలు చెయ్యసాగారు. కొంతసేపటికి రాణికి స్పృహవచ్చింది. అప్పుడు రాజు తిరిగియిలా చెప్పుకుపోయాడు: 'ఇదంతా ఒక్క లిప్తలో జరిగిందంటే నమ్మండి. అప్పటికీ గబగబ ఆ రాబందులు ఎగిరిపోయిన దిక్కుకి నేనూ, వందమంది జనమూ, దాసీలూకూడా పరుగులెత్తాము. నడక అలవాటులేని నేను వెనకపడ్డాను. కాని, నా పరిజనముమాత్రం శరవేగంతో ఆ రాబందులు వెళ్ళిన దిక్కుగా వెంబడించారు. ఐతే, మరి కొంచెం సేపటికే, రాబందులు కంటికి కని పించకుండా మాయమైపోవటంతో నిరాశ చెంది పరివారమంతా మళ్ళుముఖం పట్టారు. ఇదిచూచి, నాకు మరి ముందుకు అడుగుపడక ఆగిపోయాను. ఇంతలో మరి వక గొప్ప చిత్రం జరిగింది. తిరిగి వస్తూన్న నా పరివారం (ఆ వందమంది సేవకులూ, ముగ్గురు దాసీలూ) నేను చూస్తూవుండ గానే కొంతదూరం వచ్చి వచ్చి, ఒక్కసారి పక్షులుగా మారి, ఆ రాబందులు పోయిన దిక్కుగానే వాళ్లూ ఎగిరిపోయారు, ఇదంతా కళ్లబడటంతో మనస్సు వికలమైపోయింది. ఇంకెన్ని కష్టాలు అనుభవించాలో, దేవుడు నన్నింకా ఈ లోకంలో ఎందుకు అట్టే పెట్టాడో అనిపించింది" అని ముగించి రాజు తిరిగి దుఃఖించసాగాడు.



ఈలోగా ఈ వార్తలు చెవిని పడిన జ్యోతిష్కుడుకూడా అక్కడకు రావటం జరిగింది. జ్యోతిష్కుణ్ణి చూస్తూనే రాణి ఆయన పాదాలపైన పడి, "మీరు అనాడు అంత చెప్పినాకూడా పిల్లల్ని రక్షించుకో లేకపోయాం. నా చిట్టితల్లులు నా ఎదట లేకపోతే పోయారు. దాపరికం లేకుండా ఒక్కసంగతిచెప్పండి. కనీసం వాళ్లు ప్రాణాలతోనైనా వున్నారో లేవో తెలుసుకుంటే కాని నేను బతకను" అంటూ భోరున ఏడ్చింది. జ్యోతిష్కుడు మళ్లీ ఒకసారి పిల్లల జాతకం తెప్పించి, నిదానంగా పరిశీలించి చూచి యిలా చెప్పాడు.—

"అమ్మా! జాతకరీత్యా పిల్లలకు ఈ యేడు ఏ విధమైన గండమూ కనపడదే! మరి, యిది ఎలా జరిగిందో నాకే బోధపడటం లేదు. పిల్లలు ఎక్కడ వున్నారో మాత్రం ఈపళంగా చెప్పలేనుగాని, వున్న చోటమాత్రం వారు ముగ్గురూ క్షేమంగానే వున్నారు. అమ్మాయిలేకాదు, వారివెంట అండగా వెళ్లిన వందమంది పరిచారకులూ, దాసీలూకూడా సురక్షితంగానే వున్నారు. ఈ మూడేళ్ళలో వాళ్ళు ఏనాటికో ఒకనాటికి తిరిగి మామూలు రూపంతో వచ్చే అవకాశం స్పష్టంగా కనిపిస్తోంది. కనుక దేవునిమీద భారంవేసి అటువంటి సుదినం ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూడటం కంటె మనం చేయగలిగింది ఏముంది, తల్లీ!" అని ధైర్యం చెప్పాడు.

రాజు యింతకుముందు పెద్ద పెట్టున ఏడుస్తూ రావటం, ఆతర్వాత తన విచారానికి అనుగుణంగా అనేక విషయాలు జరిగినట్టుగానే రాణికి నచ్చజెప్పటం, అన్నీ రాజు కావాలని కల్పించినవే అని ఈ పాటికే పాఠకులు గ్రహించివుంటారు. తన ముగ్గురు కుమార్తెలూ, వాళ్లతోపాటు బయల్దేరిన ముగ్గురు దాసీలూ మరోవందమంది



నౌకరులూ కన్పించకుండాపోవటంచూసి రాణీ తనను ప్రశ్నిస్తే ఏమి జవాబు చెప్ప టమా అని రాజు తీవ్రంగా ఆలోచించే, ఈ నాటకం కల్పించాడు.

పోనీ భూగృహంలో దాచిన సంగతి వెల్లడి చేదామా అంటే ఆ సంగతి తన కుమార్తెలను పొట్టబెట్టుకోవాలని చూస్తున్న దుష్టగ్రహం చెవిని పడుతుందేమోనని అనుమానం. ఏమైతేనేం, లేకలేక కలిగిన తన కుమార్తెలను రక్షించుకోవటానికని రాజు ఎంతో నేర్పుగా, ఎవరికీ అనుమానం కలగకుండా ఈవిధంగా పెద్ద అబద్ధం ఆడేశాడు.

రాజు ఆడిన ఈ కపట నాటకం రాణీ నమ్మింపి. సిబ్బందీలు అందరూ నమ్మారు. కాని ఒకటి; తనపిల్లలు ఎక్కడో ఒకచోట ప్రాణాలతో బ్రతికేవున్నారు అని జ్యోతిష్కుడు చెప్పటంవల్ల రాణీ కొంచెం కుదుటపడింది. ఎక్కడో అక్కడ బతికి బాగావుంటే అదే పదివేలు అనుకొని మన స్సులో తృప్తిపడింది. వెంటనే సేవకులను రాజ్యంలో నాలుగు మూలలకూ పంపి బిడ్డ లను వెతికి తెప్పించవలసిందని రాజును అదేపనిగా వేధింపజొచ్చింది. పిల్లలు భూ గృహంలో వున్నారని తెలియదా రాజుకి? ఐనా, రాణీ కోరిక ప్రకారం ఆమెని తృప్తి పరచేందుకు సేవకులను దేశం నలుమూల లకి పంపక తప్పిందికాదు.

తక్షణమే రాజుగారి సేవకులు గుఱ్ఱాల మీద బయల్దేరి వెళ్లారు. కాని ప్రపంచంలో బైట మనుషులకు కనిపించేచోట వుంటేగా ఆ పిల్లలు, సేవకులకు ఆచూకీ దొరికేది. వాళ్ళు భూగృహంలో సురక్షితంగా ఉన్నా రాయె. అందువల్ల బయల్దేరి వెళ్ళిన సేవ కులు ఒక్కొక్కరే బిడ్డలు కనిపించలే దంటూ తిరిగి వచ్చేశారు. రోజులు గడిచిన కొద్దీ రాణీకి బిడ్డలగురించి ఆరాటమూ,

ఠంగా హెచ్చు అవుతూవుంది. రాజు మాత్రం తెలివిగా నాటకం ఆడి తన పిల్లల సంగతి ఎవరికీ ఏమాత్రం ఆచూకీ దొరకకుండా కట్టుబాట్లు చేశానుగదా అని మురిసిపోతున్నాడు. కాని, పైకిమాత్రం తనూ పిల్లలనుగురించి బెంగపడుతున్న వాడిలాగా లోకంకోసం దుఃఖం నటిస్తూనే వున్నాడు.



ఈలోగా రాజు ప్రతిరోజూ మూడోకంటివానికి తెలియకుండా భూగృహంలోకి వెడుతున్నాడు వస్తున్నాడు. తన ముగ్గురు బిడ్డలూ సురక్షితంగా తను ఏర్పరచిన నౌకరుల అండన పెరుగుతూవుండటం చూచి ఫరవాలేదు కదా అని నిశ్చింతగా వున్నాడు. ఇలా ఒక వారం రోజులు గడిచినై. మళ్లీ రాజుకి యిప్పుడు మరొక పెద్ద అనుమానం పట్టుకొన్నది. ఏమిటీ అంటే: తను భూగృహంలోకి వెళ్ళి పిల్లలను చూచి వాళ్లు సురక్షితంగా వున్నారా లేదా అని తెలుసుకుంటేగాని ఒక్కరోజుకూడా నిలవలేడు. కాని మరోపురుగుకికూడా తెలియకుండా యిలా రోజూ దొంగతనంగా భూగృహంలోకి వెడుతూ వస్తూ వుండటం చాలా కష్టమైన పనిగా తోచింది. ఒకనాడు కాకపోతే ఒకనాటికైనా ఈ సంగతి ఎవరికంటనో ఒకరికంట పడుతుంది. అది ఆనోటా ఆనోటా వెల్లడిఅయి తను ఏ దుష్టగ్రహాన్ని గురించి భయపడుతున్నాడో ఆ గ్రహానికి తెలిసిపోవచ్చు. పిల్లలజాడ తెలిసిందీ అంటే ఆ గ్రహం ఏదో విధంగా వాళ్ళని పొట్టకొట్టుకుంటుంది కాని మానదు. కనుక ఏమి చెయ్యటమా అని రాజు ఈ క్రొత్తదిగులుతో కుంగిపోసాగాడు. ఎంత ఆలోచించినా ఏమీ పాలుపోయింది కాదు. ఇలా మరి నాలుగు రోజులు గడిచినై.

ఒకనాడు – రాజు ఆ సాయంత్రమే భూగృహంలో పిల్లల్ని చూసి కొంచెంసేపటి క్రితమే వచ్చాడు. బిడ్డలు సురక్షితంగానే



వున్నారు. అందువల్ల రాజు తన శయనాగారంలో ఏ బెంగా లేకుండా నిశ్చింతగా నిద్రిస్తున్నాడు. మంచి నిద్రలో ఉండగా ఒకరాత్రివేళ ఎవరో వచ్చి తనని తట్టి లేపుతున్నట్టు అలికిడి ఐంది. కళ్ళు తెరిచి చూచాడు తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఎందువల్లనంటే ఆ వచ్చినది మరెవ్వరో కాదు, తన ముద్దుల కూతురు సుహాసిని! కొంతసేపటివరకూ రాజు ఇది కల అనే అనుకున్నాడు. కాని సుహాసిని పక్కపైన కూచుని, తండ్రిని ఎక్కి తొక్కుతూ, చిలిపిచేష్టలు చేస్తూ "నాన్నా, నాన్నా" అని పిలిచేసరికి రాజు ఇది ఎంత మాత్రము కలకాదు అని నిశ్చయించాడు. తన కళ్ల ఎదట తన చిట్టితల్లి సుహాసిని చిన్నారి చేష్టలు చేస్తూవుంటే, ఎలా కాదనటం? చిలకపలుకులతో తనను పిలవటం స్పష్టంగా వినబడుతూ వుండగా, ఇది కల అని ఎలా అనుకోవటం? రాజు వెంటనే లేచి తెలివి తెచ్చుకొని, సుహాసినిని గుండెలకి హత్తుకుంటూ "ఇదేమిటి తల్లీ, ఈ అర్ధరాత్రివేళ నువ్వు యిక్కడికి ఎలా వచ్చావమ్మా? ఏరీ, మన దాసీలు ఏరి? పరివారమంతా ఎక్కడ? నవుకర్లు ఏమైనారు? ఇంతమందినీ విడిచిపెట్టి నీవు ఒక్కర్తెవూ ఎలా వచ్చావు తల్లీ! చిత్రంగా వుందే" అంటూ, ఒకవంక ఆశ్చర్యంతోనూ, మరొకవంక చెప్పరాని ఆత్రంతోనూ వందలూ వేలూ ప్రశ్నలవెంబడి ప్రశ్నలు కురిపించాడు.

సుహాసిని కొంతసేపటివరకూ బదులు చెప్పలేదు. కాని తండ్రి చెయ్యిపట్టుకొని, మంచంమీదినించి క్రిందికి దిగమని సైగ చేసి, తర్వాత ఆ గదిలోవున్న ఒక పెద్ద పటం దగ్గిరికి తీసుకువెళ్లి "అదో, ఆబొమ్మ చూశా?" అని అడిగింది. రాజుకి ఏమీ అర్థంకాలేదు.

"నువ్వు యిక్కడకి ఎలా వచ్చావు తల్లీ అని అడుగుతుంటే పటం చూపిస్తా వేమిటమ్మా. ఆపటం నీకు కావాలంటావా? అలాంటివే కాదు, అంతకన్న మంచి మంచి పటాలు ఎన్నో యిస్తాను. నువ్వు యిక్కడి కెలావచ్చావో ముందు చెప్పుతల్లీ" అని రాజు మళ్ళీ బ్రతిమాలసాగాడు.

అప్పుడు సుహాసిని— "అదే నాన్నా, అదే ఆ పటంలోంచే వచ్చా" అన్నది పాపం, అమాయికంగా.

పటంలోంచి ఏమిటి, రావటం ఏమిటి అని రాజు కొంతసేపు మథనపడి చివరకు పటాన్ని తొలిగించి చూచాడు. పటాన్ని గోడనుంచి తొలగించటంతోటే కంటపడిన దృశ్యం చూచి, రాజు కొయ్యబారి, అలాగే నిలబడిపోయాడు. ఎందువల్లనంటే పటం తీసివేసినచోట గోడలో ఒక పెద్ద ద్వారం కనిపించింది. రాజు కాసేపటికల్లా తెప్పరిల్లుకొని కూతురుని వెంటబెట్టుకుని ఆ ద్వారంవెంట లోపలికి పోయాడు. అలా పోగా పోగా అది ఒక సొరంగంఅని రాజు తెలుసుకున్నాడు. అందుచేత బిడ్డను నడిపించక, ఎత్తుకుని జాగ్రత్తగా అడుగులో అడుగువేసుకుంటూ సాగాడు.



సొరంగంలో సగందూరం వెళ్లేసరికి సుహాసినిని పెంచేటటువంటి దాది ఎదురు వచ్చింది. సుహాసిని గదిలోంచి మాయం అయ్యేటప్పటికి దాది నిద్రలో వున్నది. కాని మరుక్షణంలోనే మెలకువ వచ్చి చూచేసరికి పక్కమీద సుహాసిని లేక పోవటం, అందుకు తగినట్టు గోడలో అది వరకు అడ్డంవున్నచోట ద్వారం కనిపించటం, దాదికి హడలు పుట్టింపింది. ఆమె పిల్లను వెతుక్కుంటూ తనకు తెలియకుండానే ఆ సొరంగంలోకి వచ్చేసింది. పిల్లను వెంటబెట్టుకుని వస్తున్న రాజుని చూచేసరికి ఆమెకు ప్రాణం లేచివచ్చింది. ముగ్గురూ కలిసి తీరా సొరంగం చివరికి వచ్చి చేరుకునేసరికి అంతకుముందు అక్కడ సుహాసిని గదిలోకి దారినిచ్చే ద్వారం కనిపించలేదు. రాజూ, దాదీకూడా హడిలిపోయారు. ఒకవేళ ఈ సొరంగంలో దారితప్పి వచ్చామా అని అనుమానం కలిగింది. రాజు వెంటనే సుహాసినినీ దాదినీ అక్కడే వుండమని, తను తిరిగి సొరంగం చివరిదాకా పోయాడు. ఎంతదూరం పోయినా ఒక్కటేమార్గం కాని రెండు మార్గాలున్నట్టు కనిపించలేదు. సొరంగం పోయి పోయి మళ్లీ రాజుగదిలోకే దారి తీసింది. అందువల్ల రాజు యిప్పుడు మరీ భయపడసాగాడు. ఏమిచెయ్యటమా అనే ఆలోచనతో తిరిగి దాది వున్నచోటికి వచ్చాడు. కాని చిత్రంలోచిత్తం! ఒక్క క్షణం క్రితం అక్కడ తను వదలి వెళ్ళిన దాదీ, కుమార్తెకూడా మాయమయ్యారు. ఇదంతా చూచి రాజుకి పిచ్చెత్తినట్లయింది. ఏమీ పాలుపోక అలా ఆ సొరంగంలోనే అటూ యిటూ పచారుచెయ్యసాగాడు.

---

[రాజు అనుమానానికి తోడు, అడుగడుక్కి ఈ అవాంతరాలేమిటి? సుహాసినిగతీ, ఆమెతో కూడావుండే దాది సంగతి ఏమైంది? అంతకూ రాజు, వాళ్ళ జాడ కనిపెట్టగలిగాడా, లేదా?—వచ్చే నెల చదవండి]






పూర్వం ఒకప్పుడు తంజావూరు రాజ్యాన్ని రఘునాథరాయలు పరిపాలిస్తూ వుండేవాడు. ఆయనకు సంగీతం అంటే మహాప్రీతి. అంచేత, ఎక్కడెక్కడి సంగీత విద్వాంసుల్ని రప్పించి, గాన సభలు చేయించి, గొప్ప గొప్ప బహుమానాలతో సత్కరించటమే గాక, వాళ్ళందరితోనూ "మీరు నా అస్థాన విద్వాంసులుగా ఇక్కడే ఉండిపొండి. మడులూ, మాన్యాలూ అగ్రహారాలూయిస్తాను. అని చెప్పేవాడు. అలానే వారు అక్కడే అస్థాన విద్వాంసులుగా స్థిరపడి పోతూవచ్చారు.

అస్థానంలోని అందరూ గొప్ప విద్వాంసులే ఐనా అందర్లోకి మొదట చెప్పవలసిన గాయకురాలు కామాక్షి. కామాక్షి కంఠం ఎత్తితే, ఏడిచే పిల్లలు ఊరుకుంటారు. మేసే పశువులు మేతమానేసి నిలబడిపోతై. పుట్టల్లో ఉన్న పాములు చక్కావచ్చి పడగలెత్తి నాట్యం చేస్తయి,. కామాక్షిపాట అంతగొప్ప పాట. అటువంటి విద్వాంసురాలు తన అస్థానంలో ఉండడం రఘునాథరాయలకు చాలా గర్వంగా ఉండేది, అయన ఆమెకు 'మధురవాణి' అనీ, 'వసంత కోకిల' అనీ, బిరుదులెన్నో ఇచ్చాడు. కానుకలూ, మాన్యాలూ మాట లెక్కే లేదు.

కామాక్షి గొప్ప గాయకురాలేగాని అందగత్తెమాత్రం కాదు. అందం లేకపోవటమే కాదు, కురూపే అని చెప్పాలి. ఐతేనేం, ఆవిడ సంగీతం వినటానికొచ్చినవాళ్లు గాన మాధుర్యంలో పరవశులైపోవటమే కాని, ఆవిడ అందం ఊసు వాళ్ళకెందుకు?

ఇలా ఉండగా ఒకసారి రాయలవారి మిత్రుడైన హైదరాబాదు నవాబు సపరివారంగా చూడ వస్తున్నట్టు కబురు వచ్చింది. రాయలవారు బ్రహ్మానందభరితులైపోయారు. అపరూపములైన వినో

డి. కృష్ణవేణి, కాకినాడ




దాలూ, ఆవీ జరిపించటానికి ఏర్పాటు చేశారు. నగరమూ, రాజసభా అద్భుతంగా అలంకరింపబడినై. నవాబు నగరముఖానికి వేంచేయటంతోనే రాయలవారు సపరివారంగా ఎదురువెళ్లి స్వాగతం ఇచ్చి తీసుకవచ్చారు.

ఈ సందర్భంలో జరిగిన పాటకచ్చేరిలో కామాక్షి మహా జోరుగా పాడేసింది. 'అచ్ఛా! అచ్ఛా!' అంటూ నవాబు మరీ మరీ మెచ్చుకొని, స్వయంగా లేచి వెళ్ళి తన మెడలోని ముత్యాలహారాన్ని తీసి కామాక్షికి బహుమతిచేశాడు. నవాబుగారికి ఎడంకాలు కొంచెం సొట్ట కావటంచేత ఆయన సభలో కుంటుతో నడవవలసి వచ్చింది. అది గమనించిన సభ్యులంతా, 'ఇంత గొప్ప నవాబుకి ఈ కాలికుంటి యేమిటో పాపం!' అని లోలోపల సానుభూతి కనపరిచారు. ఐతేం, ఆ సానుభూతి అంతా మరుక్షణంలోనే మారిపోయింది. 'తప్పంతా నవాబుదే! ఆ ముత్యాలహారం కామాక్షికి ఇచ్చినవాడు చక్కావస్తే తీరిపోను. అలా రాక ఏదో తెలివిగా మాట్లాడాలనుకుని, కామాక్షిని అవమానం చేశాడు' అన్నారు. ఆమె అందమైనది కాదని అందరికీ తెలిసిన సంగతే. నవాబు ఆమెదగ్గిరగా వెళ్ళేటప్పటికి కామాక్షి కురూపితనం స్పష్టంగా కనపడింది. నవాబు నవ్వుతూ 'కామాచ్చీ, మీకీ షరష్యాతీ శానా గుడ్డిదటే!' అని చలోక్తి విసిరాడు.

"ఏంప్రభూ, సరస్వతీదేవి గ్రుడ్డిదని సెలవిస్తున్నారే?" అని అడిగింది.

అందుకు నవాబు "హే మియా? యెంతా గుడ్డిడిఖాఖాపోతే, నీవంటీ ఖురూపినీ యెట్లా అశ్రయిస్తాదటే? నీ మొఖం సూస్తె డోఖూ వస్తాదీకాదూ? హట్వంటీ మొఖం నీది. ఐనా షరష్వాతీ నీకిసేతా ఐతే బాగా పాడిస్తాదీ! అన్నాడు.

కామాక్షికి నవాబుగారి హాస్యం అర్థమైంది. "విద్యల సరస్వతి ఉత్త అంధురాలు గనుకనే నీవు ఇంత కురూపివని తెలుసుకోలేక నిన్ను ఆశ్రయించి, నీచేత ఇంత గొప్పగా పాడిస్తోంది" అని ఆయన ఉద్దేశం. ఆమాటలో 'కామాక్షీ, నువ్వు చాలా బాగా పాడగలవు' అన్న మెప్పు ఉంది, 'నువ్వు కురూపివి సుమా' అన్న దెప్పు ఉంది. మెచ్చుకుంటే సంతోషిస్తారు కాని ఎవరైనా, టొంపు పొడిచి మాట్లాడితే ఊరుకొంటారూ? తమ అభిమాన గాయకిని అలా అవమానం చేశారు నవాబుగారని సభలో అందరికీ కోపం వచ్చింది. వచ్చింది కాని ఏంచెయ్యగలరు? మరొకడూ, మరొకడూనా? హైద్రాబాదా నవాబాయిరి? కోట్లకొలది కాసులు ఖజానాలో మూలుగుతున్న ప్రభువు! అంచేత కోపం అంతా దిగమింగుకున్నారు ఎవళ్లమటుకి వాళ్లు.

కాని కామాక్షీ మాత్రం ఊరుకోలేదు. ఉక్కకాటుకు చెప్పుదెబ్బలాగ నవాబుకు సమాధానం చెప్పింది. అందమంటే లేదు గాని, గడుసుదనమూ, తెలివితేటలూ ఏమంత తక్కువ కామాక్షికి.




"ప్రభూ, ఒక్క సరస్వతీదేవి మాత్రమే గ్రుడ్డిది కాదు. ఆవిడ అత్తగారైన లక్ష్మీదేవి కూడా గ్రుడ్డివే!" అన్నది.

"హేంమ్మి? లచ్మీదేవిఖుడా గుడ్డిదీ?" అని ఉగ్రుడైనాడు నవాబు.

"చిత్తం ప్రభూ. కాకపోతే తమవంటి కుంటివారిని ఆశ్రయించి ఇంతటి గొప్ప ఐశ్వర్యం ఇవ్వడమేమిటి? గుడ్డిది గనుకనే ప్రభువుల కుంటికాలు ఆమె గమనించలేకపోయింది" అన్నది నిర్భయంగా.

ఈ ఎత్తిపొడుపుకి నవాబుకు ఎక్కడలేని రోషం వచ్చింది. ఐతేం? తప్పంతా తనదే గనక నోరెత్తలేకపోయాడు.




పూర్వం త్వష్టప్రజాపతి అని ఒక గొప్ప విశ్వకర్మ ఉండేవాడు. అతను దేవతలకి విమానాలు, ఆయుధాలు చేసి ఇచ్చేవాడు.

విశ్వకర్మకు సంధ్యాదేవి అనే చక్కటి కూతురు. ఆమె చాలా సుకుమారురాలు. సంధ్య పెళ్లియీడుకురాగా, సూర్యుడే ఆమెను వరించాడని తెలిసి తక్కిన దేవతలంతా పోటీచేయక ఊరుకున్నారు. సూర్యుడు లోకాలన్నీ నిత్యం తిరిగొచ్చే వాడు గనక ఎక్కడెక్కడి పెళ్లికూతుళ్ళ సంగతీ అతనికి తెలుసును. వాళ్లందరిలోకీ సంధ్యాదేవి అందమైనదని తోచి ఆమెనే పెళ్ళిచేసుకుందామని నిశ్చయించాడు. సూర్యభగవానుడి గొప్పదనం తెలిసిన విశ్వకర్మ ఒక మంచి ముహూర్తాన సంధ్యాదేవిని సూర్యదేవునికిచ్చి పెండ్లిచేశాడు.

గొప్పవాణ్ణి పెళ్ళిచేసుకున్నందుకు సంధ్యాదేవి మొదట సంబరపడిందేగాని అత్తవారింటి కెళ్లడంతోనే ఆ సంబరమంతా చప్పబడి పోయింది. సూర్యుడు లోక బాంధవుడే కావచ్చుగాని ఆ భగభగమండే భర్తతో ఎలా కాపరం చెయ్యటం? అందులోనూ సంధ్యాదేవిలాంటి సుకుమారి అసలే చెయ్యలేదు. "స్వామీ, మీరు చాలా వేడిగా ఉన్నారు. మీవద్ద ఉండటం నాకు చాలా కష్టంగా ఉంది" అని తనబాధ భర్తతో చెప్పుకుందామని ఆమె అప్పుడప్పుడు అనుకునేది గాని ఆయన ఏమనుకుంటాడో అని భయపడి చెప్పకుండా ఊరుకునేది.

కొంతకాలానికి ఆవిడకు వైవస్వతుడు, యముడు అనే ఇద్దరు కొడుకులూ, యమున అనే ఒక కూతురూ పుట్టేరు. క్రమంగా సూర్యుని వేడి, తగ్గకానికిబదులు ఎక్కువై పోయి, సంధ్యాదేవికి సహించటానికి వీల్లేనంత బాధ కలిగించింది. ఆమె తనబాధ ఎవళ్ళకీ చెప్పుకోలేక ఒంటరిగా కూచుని

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మద్రాసు

దుఃఖించింది. అప్పుడు ఆమెనీడ ఆమె ప్రక్కనే కనపడింది. ఆ నీడ సరిగ్గా తన లాగే కనపడేసరికి సంధ్యకు ఒక ఆలోచన తట్టింది. ఆ నీడకు ప్రాణంపోస్తే అది తన లాగే సుందరి అయి, సరిగ్గా తనలాగే ఉంటుంది. తనస్థానంలో ఆమెను సూర్యునికి భార్యగాఉంచేసి, తాను పుట్టింటికి వెళ్ళి, ఇంతవరకూ సూర్యుని వేడి వల్ల కమిలిపోయిన తన శరీరం తెరుకునేవరకు అక్కడ విశ్రాంతి తీసుకుని అపిమ్మట రావచ్చు అని.




వెంటనే సంధ్యాదేవి తననీడకు ప్రాణం పోసి అచ్చు తనవలెనేఉన్న ఆ సుందరికి, ఛాయాదేవి అని పేరు పెట్టింది. 'ఛాయ' అంటే నీడ. ఛాయాదేవి "అక్కా, నన్నెందుకు పుట్టించావు?" అని అడిగింది. సంధ్య తన బాధంతా చెప్పి, "నువ్వు భర్తగారికి అనుమానం తగలకుండా నడుచుకోవాలి. ఆయనకు సందేహం రాకుండా నా పిల్లల్నికూడా ఇక్కడే విడిచి వెడుతున్నాను. వాళ్ళకికూడా ఏ సంశయమూ కలగకుండా 'ఇది అమ్మే' అనే నమ్మకం పుట్టేటట్లు నువ్వు వాళ్ళని పెంచాలి. మన యీ రహస్యం ఎవ్వరికీ తెలియనివ్వకూడదు" అని చేతిలో చెయ్యి వేయించుకుని, మర్నాడే సంధ్యాదేవి పుట్టింటికి వెళ్ళింది.

సంధ్యాదేవి తనంతతానే వచ్చిందనేటప్పటికి "ఏం చెప్మా" అనిపించింది విశ్వకర్మకి. ఆమె మనసువిడిచి చెప్పటానికి బిడియపడింది. బహుశా మొగుడితో ఏదో పేచీవచ్చి, ఇలా వచ్చేసి ఉంటుందనీ, కొన్నాళ్ళుపోతే అల్లుడేవచ్చి అమెను సమాధానపరిచి తీసుకు వెడతాడనీ, అంతగా రాకపోతే తామే తీసుకుపోయి అప్పుడే దిగబెట్టవచ్చుననీ తలిదండ్రులు అనుకున్నారు.




కాని వాళ్లు అనుకున్నట్లు సూర్యుడు ఎప్పటికీ రాలేదు. ఎందుకొస్తాడు? అతడికి సంధ్యాదేవి బాధగానీ, ఆమె పుట్టింటికి వెళ్లిందనిగానీ తెలుస్తేగా! ఛాయాదేవి కాస్తకూడా సూర్యునికి అనుమానం కలగకుండా అచ్చు సంధ్యాదేవిలాగే వర్తిస్తున్నదాయె! పోనీఅంటే పిల్లలకికూడా అనుమానం తగలలేదు. ఛాయాదేవి వాళ్ళని స్వంతతల్లిలాగానే ప్రేమతో పెంచుతోంది. ఇంక వాళ్ళకెలా అనుమానం తగుల్తుంది?

ఇక్కడ విశ్వకర్మ, అల్లుడు రాకపోవటం చూచి, ఇంక ఉపేక్షచేయటం మంచిది గాదని తోచి సంధ్యతో, "అమ్మాయ్, చెట్టుకి కాయ బరువుకాదుకదా. నువ్వు ఎన్నాళ్లున్నా మాకానందమే. కాని భర్తతో ఉండవలసినకాలంలో పుట్టింట ఉండడం క్షేమంకాదు" అన్నాడు. అప్పుడు సంధ్యాదేవి, "నిజమే నాయనా నీవుచెప్పినమాట. నే నొక్కర్తెనూ వెళ్ళగలను. నీకెందుకు శ్రమ?" అని చెప్పేసి వెంటనేబయల్దేరింది. కాని సూర్యభగవానుని తీవ్రత తలుచుకునేటప్పటికి ఆమె గుండె ఝల్లుమంది! సూర్యలోకానికని బయలుదేరిన ఆమె దారిలో ఓ అడవిలో ఆగిపోయింది. తన లాంటి అందమైన స్త్రీ ఒంటరిగా అడవిలో ఉండటం క్షేమంగాదని తోచి, ఆమె తన మనుష్యరూపాన్ని వదిలేసి, ఒక ఆడగుఱ్ఱం ఐపోయి, అక్కడే ఉండిపోయింది. విశ్వకర్మకు ఈ సంగతేమీ తెలియక తన కుమార్తె అత్తింట జేరుకుని సుఖంగా ఉందనే అనుకున్నాడు.

సూర్యుడికి ఇవేమీ తెలియక ఛాయాదేవినే సంధ్యాదేవిఅనుకుని ఆమెను ఎంతో ప్రేమతో చూస్తున్నాడు. సంధ్యాదేవిపిల్లలైన వైవస్వతుడూ, యముడూ, యమునాకూడా ఆమే తమ అమ్మ అనుకుని, అమ్మమీద ఉండే చనవూ, గౌరవం చూపుతున్నారు.



కొంతకాలానికి ఛాయాదేవికికూడా పిల్లలు పుట్టేరు. సావర్ణుడు, శని అనే ఇద్దరు కుమారులూ, తపతి అనే కుమార్తె. ఐతే, తనకు పిల్లలు పుట్టటంతో నే ఛాయాదేవిలో మార్పువచ్చింది. అంత వరకూ తాను కన్నబిడ్డలకుమల్లే చూచి పెంచిన సంధ్యాదేవి పిల్లలంటే ఆమె కిప్పుడు ప్రేమ పోయి, వాళ్ళని సవతి పిల్లల్ని చూచినట్లు చూడటం మొదలె ట్టింది. తమనుకన్నతల్లే ఇలా పక్షపాతంతో ప్రవర్తిస్తూందని తెలిసొడంతో యముడు కోపంతో మండిపడి ఛాయాదేవిని తన్న టానికి సిద్ధపడ్డాడు. ఛాయ తక్షణంవెళ్లి సూర్యునితో పిర్యాదుచేసి ఉన్నవీ లేనివి కలిపి చెప్పింది.

ఐతే, సూర్యుడు తొందరపడేరకంగాడు. 'యముడు పిన్నవాడైనా ధర్మపరాయణుడు. అతనిలా ఎందుకు ప్రవర్తించాడు చెప్మా' అనిపించిందాతనికి. కుమారుణ్ణి పిలిచి విచారించాడు.

"తపతి పుట్టినప్పట్నుంచీ అమ్మ మమ్మల్ని సవతి పిల్లల్ని చూసినట్లు చూస్తోంది, మీకు తెలుసో లేదో" అన్నాడు యముడు. సూర్యుడా మాటలువిని ఆశ్చర్య పోయి, యముడన్నమాట నిజమో కాదో అని భార్య ప్రవర్తన గురించి, ఆమె చిన్న పిల్లలంటే ఎక్కువ మమకారం చూపిస్తోం దనీ తెలుసుకొన్నాడు. ఏమిటిది? తన కడుపున పుట్టిన ఆరుగుర్నీ సమంగా చూడటానికి బదులు సంధ్యాదేవి మొదటి వాళ్ళని సవతిపిల్లలకుమల్లే ఉపేక్షచేస్తో కడసారివాళ్ళని నెత్తి ఎక్కించుకుంటోం దేమిటి? సూర్యుడు ఉండబట్టలేక భార్యను పిలిచి నిలేసిఅడిగేడు. ఛాయాదేవి తప్పిం చుకుపోవామని చూసింది కాని సూర్యుడు అలా పోనివ్వలేదు. ప్రళయకాల రుద్రు డికిమల్లే భగ్గుమనేసరికి ఛాయాదేవి గజ

గుఱ్ఱపు ముఖంతో తాను సంధ్యాదేవిని కాదనీ, సంధ్య పుట్టింటికి వెళ్ళిపోయిందనీ యదార్థం చెప్పేసింది.

ఇదివిని సూర్యుడు చాలా విచారించాడు. "కూతురును నేను సుఖపెట్టలేక పోయానని మామగారేమనుకున్నాడో కదా" అని బాధపడి, తక్షణం విశ్వకర్మ యింటికెళ్ళి "సంధ్యాదేవి యేదండీ?" అని అడిగేడు. ఆమాట వినేటప్పటికి విశ్వకర్మ నిర్ఘాంతపోయాడు! "మీవద్దకే వెళుతున్నానని బయల్దేరిందే!" అన్నాడు. సూర్యుడు, జరిగినదంతా మామగారికి పూసగ్రుచ్చినట్లు చెప్పగా, విశ్వకర్మ అల్లుణ్ణిఓదార్చి తన యంత్రసామగ్రితెచ్చి, సూర్యుణ్ణి చేత్తోపట్టుకుని, భగ భగ మండే పెచ్చులన్నీ ఊడి కిందపడేటట్లు సానపట్టేశాడు. మంటలకు బదులు వెచ్చదనమూ, కాంతీ మిగిలి సూర్యుడు చూడటానికెంతో అందంగా కనపడ్డాడు. అలా మారిపోయి సంధ్యాదేవిని వెతుకుతూ వెళ్ళిపోయాడు. ఆవిడ తన మానాన్ని కాపాడుకొనేందుకని ఆడగుఱ్ఱమై అడవిలో ఉందని తెలిసి, తానుకూడా ఒక గుఱ్ఱంరూపంతో అక్కడికి వెళ్ళేడు.

సంధ్యాదేవికి సూర్యుడు తెలియజెప్పుకునేసరికి "ప్రభూ, మీరు మళ్ళీ మీ సూర్యరూపం ధరించకండి. మీ వేడి భరించలేను!" అని ఆమె ఉన్నమాట చెప్పేసింది. వాళ్ళలా కొంతకాలం గుఱ్ఱాలరూపంలోనే ఉండగా, వారికి అశ్వినీకుమారులుపుట్టేరు. ఈ అశ్వినీ కుమారులే దేవతలకు వైద్యులయారు. కాని సూర్యుడూ, సంధ్యాదేవి అడవిలో గుఱ్ఱాలరూపంలో అట్టేకాలం ఉండటానికి వీల్లేకపోయింది. ఏమంటే సూర్యుడు లేకపోతే లోకాలకి వెలుగో మరి? అంచేత ఇదివరకుమల్లేగాక తన వేడిఅంతా పోయిందన్న సంగతి ఆమెకు నచ్చచెప్పి తన లోకానికి తీసుకుపోయాడు.






చాలా కాలం క్రితం మృత్యుకరాజ్యాన్ని శబ్దపాలకుడు అనే రాక్షసరాజు పాలించు తుండేవాడు. ఆయనకు నూరుగురు భార్యలు. నూరుగురు భార్యలకు నూరుగురూ కూతుళ్లే. అందుచేత రాజు తదనంతరం రాజ్యం ఏలటానికి ఒక్కడైనా కుమారుడు లేకపోయాడు.

ఇందుకు కారణం ఏమంటే—ఆయన తనరాజ్యంలో ఒక క్రూరశాసనం పెట్టాడు. "ఏడుస్తూ పుట్టిన మగశిశువునీ, నవ్వుతూ పుట్టిన ఆడశిశువునీ, పుట్టిన పదిహేను ఘడియలలోపల తూర్పుశక్తికి బలి ఇవ్వాలి," అని.

పుట్టగానే ఏడవడమనేది దైవనిర్ణయం. ఎవరు కాదనగలరు? కాని, రాజ శాసనాన్ని ధిక్కరించటానికి గుండెధైర్యం చాలక, మగబిడ్డల నందరనూ ప్రజలు తూర్పు శక్తికి బలిపెడుతూనే వచ్చారు.

రాజ్యంలో పుట్టిన మగబిడ్డలందరూ శక్తికి బలిఐపోగా, ఆడశిశువులే పెరిగి పెద్దవాళ్ళయారు. ఇప్పుడు ఆరాజ్యంలోఎక్కడ చూచినా ఆడవాళ్లే. ఉద్యోగస్థులందరూ ఆడవాళ్లే. పటాలంలో సైనికులూ ఆడవాళ్లే.

ఇలా మగబిడ్డలందరూ నాశనమైపోతూ వుంటే, దేశానికి అరిష్టం పట్టుకుంది. అందుకని ప్రజలంతా కలిసి త్రిమూర్తులను గురించి ఘోరమైన తపస్సు ప్రారంభించారు. ఆ తపస్సుకి మూడు లోకాలూ కంపించిపోయినై.

అప్పుడు దేవలోకంలో బ్రహ్మ గబ గబ బయల్దేరి లయకారకుడైన శివుని వద్దకు వెళ్ళి, "ఏమయ్యా పరమేశ్వరుడా!— కష్టపడి ప్రతిరోజూ నేను మృత్యుకరాజ్యానికి ఎంతోమంది మగశిశువులను సృష్టించి పంపడమేమిటి, నీవు పదిహేను ఘడియలలోగా వాళ్ళను చంపడమేమిటి?—

క్రొవ్విడి వెంకట సీతారామారావు, విశాఖపట్టణం



ఇప్పుడు ఆ మహారాజుయొక్క కడసారి రాణికి ఒక మగ శిశువును ఇస్తున్నాను. వానిజోలికి పోయావంటేమాత్రం నేనీ ఉద్యోగం మానుకోవలసి వస్తుంది సుమా" అంటూ నిష్ఠురంగా మాట్లాడాడు.

అందుకు శివుడు "ఓయి బ్రహ్మ!—పుట్టించేవాడివి నువ్వు, రక్షించేవాడు విష్ణువు. మధ్యని నన్నంటే ఏమిలాభం? పోయి విష్ణువునే కనుక్కో" అన్నాడు. అప్పుడు బ్రహ్మ, శివుడూ కలిసి విష్ణుమూర్తి దగ్గరకు వెళ్ళారు.

బ్రహ్మ చెప్పినదంతా విని, చిరునవ్వుతో విష్ణువు ఇలా చెప్పనారంభించాడు: "ఈ విపరీతమంతకూ నా శాపమే కారణం. ఆ శాపం ఏమిటో, దానిని ఎందుకు ప్రయోగించవలసి వచ్చిందో చెబుతాను వినండి: మృత్యుక రాజ్యంలో శబ్దపాలకుడనే రాక్షసరాజు ఉన్నాడు. మూర్ఖుడూ, గర్విఐన ఆతడు తన వేయిమంది కొడుకులతో, పరివారముతో నా వైకుంఠపురంమీదకి దాడివచ్చాడు. వీని అపాయంలేకుండా అప్పుడు ఒక ఉపాయం పన్నాను. వృద్ధుడైన ఒక రాక్షసయోగి వేషంతో ఆరాత్రి వాళ్ల శిబిరానికి వెళ్ళి ఆమాటా ఈమాటా చెప్పి "ఓయి రాక్షసరాజా!—బలవంతులైన నీ వేయిమంది కొడుకులనూ చూచుకొని కులుకుతున్నావేగాని, అసలు వాళ్ల పుట్టుకలోని అంతర్యం ఏమైనా నీకు తెలుసునా?" అని అడిగాను.

"పోవయ్యా, నాకు తెలియకపోవడమేమిటి ఈ చిన్నవిషయం? నా కుమారులు వేయిమందీ అమావాస్యనాడు అర్ధరాత్రివేళ పుట్టారు. ఇందులో విశేషమేముంది!" అన్నాడు శబ్దపాలకుడు.

"అరెరే!—పిచ్చిరాజా!—ఇందులో విశేషం ఏమిటి ఉన్నదని తేలికగా మాటాడుతున్నావే! ముఖ్యమైన రహస్యం గమ



నించనేలేకపోతివే! ఇంతకూ, నీ బిడ్డలు వేయిమందీ పుట్టినప్పుడు ఏడ్చినారా నవ్వినారా, చెప్పు" అన్నాను.

"ఏడిచే వుంటారు. అయినా, మా పురోహితులకు కబురంపుతా" నంటూ, సేవకుణ్ణి పంపించాడు.

ఈలోపల నేను వానితో "ఓయీ రాజా!—మగశిశువు ఏడుస్తూ పుట్టినా, ఆడశిశువు నవ్వుతూ పుట్టినా ఎంత అరిష్టమనుకొన్నావు! రాజుకూ, రాజ్యానికీ హాని. అటువంటి ప్రభువుకు యుద్ధాలలో జయం లభించదు. ఏ పనిమీద ఎక్కడికి వెళ్ళినా ఎదురుచుక్కగానే వుంటుంది. ఈ జన్మలోని కష్టాలు అటుండగా, మళ్లీ జన్మలో ఆ రాజుకు కలిగిన సంతతి నశించిపోతారు. ఇది మన గురువులైనటువంటి శుక్రాచార్యులవారు సెలవిచ్చిన వచనం...." అని చెబుతూవున్నంతలో వెళ్లిన భటుడు తిరిగి వచ్చి, "ప్రభూ!—మన అబ్బాయిలందరూ అందరిలాగా ఏడుస్తూనే పుట్టారంట!" అన్నాడు.

"ఒక్క క్షణమైనా ఆలస్యం చేయక, మహారాజు తనరాజ్యం చేరుకొని, వేయిమంది కుమారులనూ తలలు తీయించి కోటగుమ్మానికి వేలాడ గట్టించుమని మంత్రికి ఆజ్ఞాపించాడు. అంతేగాకుండా అప్పటినుంచి తనరాజ్యంలో ఏడుస్తూ పుట్టిన మగశిశువులూ, నవ్వుతూ పుట్టిన ఆడశిశువులూ శక్తికి బలిఐపోవాలని శాసనంకూడా చేశాడు. ఈవిధంగా వాని దాడినుండి నేను తప్పించుకొన్నాను. ఇదంతా నా మహిమే" అనిచెప్పి ముగించాడు విష్ణువు.

ఇందుకు శివుడు "సరే, నీవు కల్పించిన యుక్తిచేత ఆ దుర్మార్గునికి తగిన శాస్తి జరిగింది. ఇప్పుడు వాడు మంచి మార్గానికి వచ్చాడు. కనుక, వానికి మగ

సంతతి నిలిచే ఉపాయం చెప్పవలసింది" అని విష్ణువును కోరాడు.

శబ్దపాలకునికి మగశిశువును ప్రసాదించ దలిచానన్నాడు బ్రహ్మ.

అప్పుడు విష్ణువుకు శబ్దపాలకుని పైన కరుణ కలిగింది. 'మూగేశుడు' అనేవానిని దేవలోకంనించి పంపి, మృత్యుక రాజ్యాన్ని పాలించే శబ్దపాలకుని కడపటి రాణికి కుమారునిగా పుట్టేటట్టు ఏర్పాటు చేయదలిచాను" అన్నాడు.

"పూర్వజన్మలో అన్నీ పుణ్యాలు చేసినవాడేకద దేవలోకంలోకి రావటానికి అర్హుడు? కనుక, మనం పంపే మూగేశుడు, తను దేవలోకంలో చేసిన సత్కార్యాలు తలుచుకొని నవ్వుతూ పుడతాడు. ఐతే, పుట్టగానే మాటాడే శక్తిలేకుండా చేశామంటే మన దేవలోకపు రహస్యాలు ఏమీ బయల్పెట్టలేడు. చిన్నతనం ఇలా మూగితనంగా గడిచిపోతే, పెద్దవాడయాక పూర్వజన్మ విశేషాలు మరిచిపోయి మానవులలో కలిసిపోతాడు. అందుచేత, మన రహస్యాలు మనలోకంలోనే భద్రంగా వుంటాయి. ఇదే నాకుతోచిన మార్గం..." అనికూడా చెప్పాడు విష్ణువు.

"బేష్!- బాగావున్నదంటే బాగావున్న" దన్నారు బ్రహ్మ శివుడున్నూ.

త్రిమూర్తుల అభీష్ట ప్రకారం, మూగేశుడు మృత్యుకరాజ్యానికి బుల్లిరాజుగా పుట్టాడు. అతను పెరిగి పెద్దవాడై, రాజ్యానికి రాగానే తండ్రి పెట్టిన దుష్టశాసనం తొలగించివేశాడు. దైవాంశ సంభూతుడైన అతని పరిపాలనలో ప్రజలంతా సుఖంగా వుంటున్నారు.

విష్ణుమాయవల్లనే ఈ నాటికి కూడా మానవులు పుట్టగానే మాటాడలేకపోవటం, పూర్వజ్ఞానంతో పుట్టి, క్రమంగా ఆ విశేషాలు మరచిపోవటమూ, జరుగుతున్న దని పెద్దలు చెబుతారు.





# చిత్రమైన చెట్టు

ఒకానొకప్పుడు ఉజ్జయినీ నగరానికి రూపచంద్రుడు ప్రభువుగా ఉండేవాడు. ఆయనకు పాపం, కన్నూ కాలూ కూడా లేకపోవటంచేత కూర్చున్న చోటునుంచి కదలలేక పోయేవాడు. పైగా లోకంలో మంచిచెడ్డలు చూచి ఆనందించటానికి అవకాశమేమీ లేకపోయింది.

ఇందుకు రాజు విరక్తిభావంతో 'నేను ఒక మహాపాపిని' అనుకొంటూ, నిస్పృహ చెంది ఊరుకున్నాడు.

ఇలా ఉండగా, ఒకరోజున నగరంలో ఒక చిత్రమైన వదంతి పుట్టింది.—అది యేమిటీ అంటే: 'కోట బురుజు మీద రావిచెట్టు గాలివీచినప్పుడల్లా ధ్వనిచేస్తున్నదనీ, ఆధ్వని మనిషి మాటాడినట్టే ఉన్నదనిన్నీ.' ఈవార్త తెలియగానే రాజు మంత్రికి కబురంపి, తనకు ఆ చెట్టుకింద ముకాం ఏర్పాటుచేయించమన్నాడు.

ఈ చెట్టు మాట్లాడటమేమిటో చిత్రం తెలుసుకోవాలని అక్కడనే కనిపెట్టుకు కూర్చున్నాడు రాజు.

ఒక రాత్రివేళ గాలివీచి, ఎంతోకాలం నించి ఎరిగివున్న ఒక స్నేహితుడు పలకరించినట్టుగా రూపచంద్రుని చెవిలో ఎవరో ఈ మాటలు చెప్పారు: "ఓయి రాజా!—నేను అగ్నిశర్మ అనే బ్రాహ్మణ్ని. మహాపాపాలు చేసినందువల్ల నాకు ఈ చెట్టును ఆశ్రయించవలసిన గతి పట్టింది. ఇప్పుడైనా పుణ్యకార్యాలు చేయదలిచానంటే ఈ పాపాలు హరించిపోయి, మామూలుజన్మ వస్తుంది. కనుక, ఎన్నికష్టాలైనా భరించి నీ శరీరబాధలు పోగొట్టదలిచాను. ఇందుకు నేను మానవరూపం తాల్చి, కొంతధనం చేతపట్టుకోవాలి. నా ప్రయాణానికి అవసరమైన సదుపాయాలు అమర్చితివంటే బయల్దేరిపోయి, నీకు నయంచేయటానికి

అణివిళ్ల కామేశ్వరి, బందరు



తగిన దివ్యౌషధం వెతికితెస్తా. నా మాటల మీద నీకు నమ్మకముంటే, ధనం తెప్పించి ఈ చెట్టుతొర్రలో పెట్టించు."

ఈమాటలు వినగానే రూపచంద్రుడు 'నిజంగా నా బాధలు పోగొట్టగలవాడికి ధనమేకాదు రాజ్యమంతా ఇచ్చివేద్దును' అని మనస్సులో అనుకొని, కొల్లలుగా ధనం తెప్పించి ఆ చెట్టుతొర్రలో పెట్టించాడు. అప్పటినించీ రాజుకు ఆ చెట్టుధ్వని చేయటం వినపడలేదు. దీనికి కారణం?—

చెట్టుతొర్రలోని ధనం తీసుకొని, అగ్నిశర్మ బయల్దేరాడన్నమాట! అతను పోయి పోయి ఒకఊరు ప్రవేశించేసరికి, ఒకచోట స్త్రీ కళేబరంచుట్టూ అనేకమంది గుమికూడివున్నారు. అక్కడనే ఒక అందమైన యువకుణ్ని అలంకరిస్తూ మరికొంత మంది కూడివున్నారు. 'ఈ హడావుడి అంతా యేమిటి?' అంటూ అగ్నిశర్మ అక్కడి పెద్దలను అడిగేసరికి వాళ్ళు 'అయ్యా, ఆ చనిపోయిన స్త్రీ ఈ యువకుని భార్య. భార్య పోతే భర్త ఆమెతో పాటు 'సహగమనం' చేయాలి. ఇది మా దేశాచారం. అందుకనే అతన్ని ముస్తాబు చేస్తున్నాము' అన్నారు.

వాళ్ళ మాటలకు శర్మ ఉగ్రుడై 'ఏడిచినట్టేవుంది మీ ఆచారమూ, మీరున్నూ. ఇది చాలా దురంతం. దీనిని ఏ శాస్త్రమూ వప్పదు. భార్యపోతే మగవాడు మళ్లీ పెళ్లి చేసుకుని సుఖంగా సంసారం చేసుకోవచ్చునే. ప్రతి దేశంలోనూ తెలివిమంతులందరూ ఇదే పనిచేస్తారు' అని బోధించేసరికి వాళ్లు తమ అజ్ఞానానికి సిగ్గుపడి కళ్లు తెరిచారు.

శర్మ వెళ్లి వెళ్లి మరివకపట్టణం చేరుకున్నాడు. అదేమోకాని, అక్కడి ప్రజలందరూ బెంగతో, భయంతో, విచారగ్రస్తులై ముఖాలు దించుకొని వున్నారు.

'కారణం ఏమిటి?' అంటే ఒక్కరూ బదులు చెప్పలేదు. చివరకు శర్మ ఒక వృద్ధుణ్ణి పట్టు విడువక అడిగేసరికి 'అబ్బాయీ! పది రోజులాయె భయంకరమైన వింతజంతు వొకటివచ్చి, గ్రామస్థులను కబళించుకు పోతున్నది. దానికి ఎనిమిది కాళ్ళూ, ఎనిమిది చేతులున్నూ, ఏనుగ తలకంటె పెద్ద తలకాయ, తలపైన రెండు వాడి కొమ్ములు, ఒక్కటే కన్ను. అది నుదుటి మధ్య వుంటుంది. ఈ జంతువు నోరు తెరిచి, మంటలు గ్రక్కుతుంది...."



అనేటంతలోనే, బుసలుకొడుతూ, పెద్ద ఝూంకారం వినిపించేటప్పటికి, ఎక్కడి వాళ్ళు అక్కడనే పారిపోజొచ్చారు. వెంటనే అగ్నిశర్మ "వోయి అబ్బాయిలూ! ఆగండి, ఆగండి. చప్పున పోయి ఒక నిలువుటద్దం సంపాయించుకురండి" అన్నాడు. అలానే వారు ఎక్కడనో ఒక పెద్ద అద్దం తీసుకురాగా, దానిని ఆ జంతువు వచ్చేదారిలో ఒక రాతికి గట్టిగా అమర్చి బిగించాడు.

మరికొంచెం సేపటికల్లా రంయ్‌మంటూ ఆ వింతజంతువు వచ్చేసి కొంతమందిని చంపివేసింది. తిరిగి పోబోతూవుండగా దానికి అద్దం కనపడింది. తనవంటిదే మరి ఒకజంతువు తనకు పోటీగా వచ్చినదను కొని, అద్దంలో కనపడే ప్రతిబింబంమీదికి ఎగబడింది. దెబ్బతో అద్దం పిప్పి పిప్పి ఐపోయింది. ఐనా ఆ జంతువు ఆవేశంతో అలా అద్దాన్ని ఢీకొంటూనే వుండేటప్పటికి గాజు పెంకులన్నీ దాని ఒంటినిండా గుచ్చుకొని నెత్తురు మండలమైంది. ఆ అదునులో గ్రామస్థులు దాన్ని పొడిచి ఎలాఐతేనేం, ఆ దుష్ట జంతువును హతమార్చారు. ఈ విధంగా అగ్నిశర్మధర్మమా అని ఆ నగరం మొత్తానికే గొప్ప అరిష్టం తప్పింది.



అప్పుడు ఆ పట్టణవాసులు శర్మను వారి ఊరిలో ఉండి పొమ్మని బతిమలాడారు. కాని అతను 'నేనొక గొప్ప రాచకార్యంమీద బయల్దేరాను. కనుక క్షణమైనా నిలవటానికి వీలులేదు' అంటూ వివరాలన్నీ చెప్పేవరకు, వారు 'ఇక్కడికి నాలుగామడ దూరంలో 'జీవవనం' అనే ఒక వనమున్నది. అందులో యక్షులూ, గంధర్వులూ విహరిస్తూ వుంటారు. వారికి దయపుట్టిందంటే దివ్యమైనటువంటి ఓషధులివ్వగలరు. అవి సేవించిన వాళ్ళకు శరీరబాధలేమీ ఉండనే ఉండవు,' అని చెబుతూ, అతనికి జయం కలగాలని దేవుణ్ణి వెయ్యి విధాల వేడుకొన్నారు.

అగ్నిశర్మ వారికి కృతజ్ఞత తెలుపుతూ, మళ్లీ బయల్దేరి ఈశాన్యదిక్కున నాలు గామడ వెళ్లగా రమణీయమైన రకరకాల వృక్షాలూ తుప్పలూ కనపడినై. అక్కడ దారి కనపడక, తుప్పలు ఛేదించుకొని దారి చేసుకుపోవలసి వచ్చింది. ఆ అరణ్యం పోను పోను దట్టమై, పులులు తోడేళ్లు, ఎలుగులు మొదలైన వన్య మృగాలు ఎదురుపడినై. వేలకొద్దీ, లక్షల కొద్దీ తేళ్ళూ, పాములూ అడుగడుక్కీ అడ్డుతగుల జొచ్చినై. వీటి వేటికీ లెక్క చేయక, అగ్నిశర్మ సాహసంతో ముందుకు సాగిపోయాడు.

కొంతదూరంలో అతి ఆకర్షణీయమైనటువంటి ఒక ఉద్యానవనం కనిపించింది. అందులోనించి పువ్వులన్నీ హాయి కొలిపే సుగంధాలను విరజిమ్ముతున్నాయి. అగ్నిశర్మ ఆ సౌందర్యానికి తన్మయుడై, అలానే కూర్చుండిపోయాడు.

ఇంతలో చీకటి పడింది. చీకటిపడిన కొద్దీ ఆ అరణ్యమూ, ఉద్యానవనమూ వింతకాంతులతో మెరసిపోసాగినై. ఆ చెట్ల





ఆకులలోనూ పువ్వులలోనూ ఏదో అపూర్వమైన శక్తి ఉన్నట్టు శర్మ గ్రహించాడు. ఎందువల్లనంటే, ఆ గాలి తగలగానే అతనికి మార్గాయాసం తీరిపోయి, జవమూ జీవమూ పూరించింది. పైగా అక్కడ ఎంతసేపున్నా, ఆకలిదప్పుల బాధ లేకపోయింది.

అర్ధరాత్రి అయేటప్పటికి వెనుకపక్కనించి 'ఎవరవు నీవు? ఇక్కడికి ఎందుకు వచ్చావు?' అంటూ ప్రశ్నలు వినిపించినై. అగ్నిశర్మ వెనుతిరిగి చూడగా పదిమంది గంధర్వులు కనపడ్డారు. ధైర్యంతో నిలబడి వారికి తన కథఅంతా వినిపించాడు, శర్మ. 'ఇది దేవతలు విహరించే జీవవనం అని తెలియదా? మా ఆజ్ఞ లేకుండా ఇక్కడ కాలుపెట్టినందుకు నిన్ను శిక్షించాలి' అంటూ వారు అతనిని తాళ్ళతో బంధింపబోయారు.

అతన్ని వాళ్లు బాధిస్తూవుండగా, మరి ఒక గంధర్వుడు వచ్చి 'ఈ గలభా యేమిటి?' అని అడుగుతూ అగ్నిశర్మ వేపు పరికించి చూచాడు. చూస్తూనే ఆ కొత్తగా వచ్చిన గంధర్వుడు శర్మను ప్రేమతో చేరదీసుకొని, 'ఓయి, నీవేనటయ్యా శర్మా, మహానుభావా!' అని ఎంతగానో ఆదరించాడు. తక్కిన గంధర్వులు నివ్వెరపోయి 'నీకు మానవునితో స్నేహం ఎట్లా కలిసింది?' అని అడిగేసరికి, 'ఒకప్పుడు నేను శాపవశంచేత భూలోకమందు సర్పరూపంలో పుట్టవలిసి వచ్చింది. ఆ రూపంలో నన్ను ఒక శత్రువు చంపబోగా, ఆదారిన వస్తున్న ఈ శర్మ నన్ను శత్రుబారినుండి రక్షించి పుణ్యంకట్టుకొన్నాడు. ఇతని ఉపకారం వల్లనే నాకు శాపవిముక్తి కలిగింది." అని చెప్పగా, వారందరూ అగ్నిశర్మకు బ్రహ్మరథం పట్టారు.

శర్మ, తను వచ్చిన పని చెప్పగానే, ఆ గంధర్వకుమారుడు అగ్నిశర్మను ప్రేమతో ఆదరించి, ఆకులతో తయారైన ఒక దొప్ప తెచ్చి యిచ్చి, తెల్లవారగట్ట పువ్వులమీది నించి రాలే మంచు బిందువులను పోగు చేయమన్నాడు. శర్మ అలానే చేసి, మంచుబొట్లు తీసుకరాగా. 'శర్మా ఈ మా జీవవనంలోని మంచుబొట్లు. మంచి మనస్సు గల ఎవరు సేవించినా సమస్తమైన శరీరబాధలూ క్షణంలో నయమై పోతయి. ఎవరికైనా పనిచేస్తాయి కాని, కృతఘ్నులకూ, మాటతప్పినవారికీమాత్రం పనిచేయవు సుమా' అన్నాడు.

సంతోషంతో శర్మ ఉజ్జయినికి చేరుకొని రూపచంద్రునికి కొన్ని మంచుబొట్లు ఇచ్చాడు. వాటి మహిమవల్ల తక్షణమే రాజుకి కన్నూ కాలూ వచ్చి, మళ్లీ జన్మ యెత్తినట్టుగా సంతోషించి, హాయిగా వున్నాడు. అప్పుడు శర్మ 'రాజా!—నా బహుమతి మాట యేమిటి?' అనేసరికి, రూపచంద్రుడు ఏమీ ఎరుగనివానిలాగా దిక్కులుచూడ నారంభించాడు.

అప్పుడు అగ్నిశర్మ "ఓయి రాజా!— 'ధనమే కాదు రాజ్యమంతా ఇచ్చివేద్దును' అని నీవుమనస్సులో అనుకోలేదా? మనసులో మాట కనిపెట్టగలవాళ్లు లేరనుకున్నావు కాబోలు! ఏమైతేనేమి?—నీకోసం అనేక కష్టాలుపడి ఈ మంచుబిందువులు తెచ్చి నిన్ను బాగుచేశాను. కాని, బాగుపడే యోగ్యత నీలో లేనప్పుడు నేనేంచేసేది. ఇంతటితో నాకు శాపవిముక్తి ఐపోయింది. నేను వెళ్ళిపోతున్నాను" అన్నాడు. మరి కనపడలేదు. మాట తప్పినందువల్ల రాజు మళ్లీ యథాస్థితికి వచ్చేసి, ఎప్పటిలాగా బాధపడజొచ్చాడు. శర్మ వెళ్లిపోయినప్పటి నించీ కోట బురుజుమీద ఉండే రావిచెట్టు మళ్లీ ఎన్నడూ మాటాడినట్టు మాత్రం ప్రజలు చెప్పుకోలేదు.






పురాణకాలమందు గజముఖుడు అనే రాక్షసుడు ఉండేవాడు. వాని ముఖం ఏనుగుముఖంలాగా ఉండటంచేత ఈ పేరు వచ్చిందట. గజముఖుడు శివుణ్ణిగూర్చి గొప్ప తపస్సుచేసి, ఆయనను ప్రత్యక్షం చేసుకొని, చావులేకుండా వరం పొందాడు.

వరం పొందినప్పటినించీ వానికి గర్వమూ, అహంకారమూ ఎక్కువైనాయి. వాడు తన రాక్షసమూకను వెంటబెట్టుకుని సరాసరి దేవేంద్రునిమీదికే దండెత్తి వెళ్ళాడు. దేవతలు ఎదురొడ్డి యుద్ధం చేశారు. కాని నిలవలేక పోయారు. అప్పటి నించీ రాక్షసులు దేవతలను మరీ లోకువ కట్టి బాధింపజొచ్చారు.

ఈ హింసలకు తట్టుకోలేక, దేవేంద్రుడు గజముఖునితో "ఓయి గజముఖా!— మనం అన్నా తమ్ములలాంటివాళ్లం. దెబ్బ లాడుకోవటం బాగుండదు. అంతగా నీకు స్వర్గం ఏలాలని కుతూహలముంటే అలానేకానీ. నేను ఏ అడవికో పోయి తపస్సు చేసుకొంటూ విశ్రాంతి తీసుకొంటాను" అంటూ, విరక్తి నటించాడు.

అందుకు గజముఖుడు "నీవు ఎక్కడికీ పోనక్కరలేదు. నేను చెప్పినట్లల్లా మాత్రం చేస్తూవుండాలి. అంతే నాకు కావలిసింది" అన్నాడు.

గజముఖుడి ఔదార్యానికి దేవలోకంలో అందరూ సంతోషించారే కాని, వాడు చేసిన తంత్రం కనిపెట్టలేక పోయారు. ఒకరికి తెలియకుండా ఒకరిని తన సమక్షానికి రప్పించి, తనవాళ్ళందరి ఎదటా దేవత లందరిచేతా రోజూ గుంజీలు తీయిస్తూ ఉండేవాడు. ఈ అవమానాన్ని భరించలేక, దేవతలు శివునితో మొరపెట్టుకున్నారు.

అప్పుడు శివుడు తన పెద్దకొడుకైన వినాయకుణ్ణి పిలిచి 'నాయనా! నయాన

డి. కృష్ణవేణి, బళ్ళారి



గాని భయానగాని నీవు గజముఖుణ్ణి లొంగదీసి, దేవలోకంలో ఉండే మనవాళ్ళకు బాధ లేకుండా చేయవలిసింది" అని తన అభిలాషను వెల్లడించాడు.

వినాయకుడనగానే 'చాకలి గూనంత బొజ్జా వీడున్నూ; కూచుంటే లేవలేని ఈ గణపయ్యా, గజముఖుణ్ణి లొంగదీసేది !..' అనిపిస్తుంది ప్రతివాళ్ళకూ. కాని, పని వచ్చిందంటే గొప్ప పౌరుషంతో యుద్ధం చేయగలడు వినాయకుడు. అటువంటప్పుడు గజముఖుణ్ణి లొంగదీయటమనేది గణపతికి ఒక్క గొప్ప విషయం కానే కాదన్నమాట.

తండ్రి ఆజ్ఞప్రకారం వినాయకుడు, గజముఖునివద్దకు వెళ్ళి "అబ్బాయీ! నీవు తక్షణమే స్వర్గంవిడిచి, నీ లోకానికి వెళ్ళిపో!" అని శాసించాడు.

వినాయకుణ్ణి చూచి గజముఖుడు వెటకారంగా హుంకరించాడు.

గణపతికి కోపంవచ్చి, వీడిని క్షమించకూడదు అనుకొన్నాడు. వారిద్దరికీమధ్య యుద్ధం ప్రారంభమైంది. గణపతి తన వద్దనుండే ఆయుధాలూ అస్త్రాలూ అన్నీ ఉపయోగించివేశాడు. సూర్యభగవానుని మామఐన విశ్వకర్మ ప్రత్యేకంగా ఇందుకు తయారుచేసిఇచ్చిన ఆయుధంకూడా ఉపయోగించాడు. ఐనా లాభం లేకపోయింది.

చివరకు గణేశుడు ఉగ్రుడై, తన రెండు దంతాలలోనూ ఒక దంతం పళక్కున విరిచి, మంత్రపూరితంగా దానిని గజముఖునిపైకి ప్రయోగించాడు. వాడిమొనగల ఆ మంత్రదంతం అంకుశంలాగా తగులుకుని, వాని శరీరం పొడచి పొడిచి హూనంచేయ నారంభించింది. దెబ్బతో ఒళ్ళంతా తూట్లుపడి, నెత్తురు కాలువలు ప్రవహించగా భరించలేక వాడు పరుగుచ్చుకున్నాడు. అప్పటికీ వదలక, ఆ దంతపు

ముక్క వానిని వెంటతగిలింది. అంతట ఒక ఎలుక కన్నం కనబడేటప్పటికి, బతుకు జీవుడా అనుకుని ఎలుకరూపంతో గజముఖుడు ఆ కన్నంలో దూరిపోయాడు.

మంత్ర దంతం అంతటితోనూ ఊరుకో లేదు. కన్నంత్రవ్వి, ఎలుకరూపంలోవున్న గజముఖుని బయటకు లాగి, తన స్వామి ఐన గణేశునిముందు పడవేసింది.

అయాసంతో పడివున్న ఆ ఎలుకను చూచి గణపతికి జాలిపుట్టి, "ఓయి గజ ముఖా!—దేవతల్ని బాధపెట్టిన వాళ్ళకు ఎటువంటి శాస్త్రి జరుగుతుందో అనుభవ మైందికదా! ఇప్పుడైనా బుద్ధి తెచ్చుకుని నీలోకానికి నీవుపోయి సుఖంగా బతుకు!' అంటూ మందలించాడు.

అప్పుడు గజముఖుడు "మహానుభావా, గణేశా! కావాలంటే నీకు నేను దాసోహ మంటాను. దాస్యంచేస్తాను. కాని, నేను దేవతలపైన కసి తీర్చుకోవటంలోమటుకు నీవు అడ్డురావద్దు. వాళ్లుపూర్వం నావాళ్లను పెట్టిన బాధలకుగాను ప్రతిగా గుంజీలు తీసి తీరవలసిందే" అని ప్రాధేయపడ్డాడు.

దుర్మార్గుడైనప్పటికీ, గజముఖుడు వెల్లడించిన అవేదనలో నిజం లేకపోలే



దని గణపతి గ్రహించాడు. వానిలో నీతి నియమాలకు కట్టుబడే సుగుణంకూడా ఉన్నదని కనిపెట్టాడు. కనిపెట్టి, వానితో "గజముఖా!— నీ హృదయంలో వుండే బాధ నాకు బోధపడింది. నీయిష్టప్రకారం దేవతలందరూ నీయెదట గుంజీలు తీసే టట్టు ఏర్పాటు చేస్తాను. నీ కసి తీర్చుకో వచ్చు. ఐతే నాకు దాస్యం చేస్తానని మాట ఇచ్చావుకదా, అమాట నిలబెట్టు కొంటావా?' అని అడిగాడు.

'తప్పకుండా నిలబెట్టుకుంటాను. మీ అజ్ఞ శిరసావహిస్తాను' అని నిండుమన స్సుతో వప్పకొన్నాడు గజముఖుడు.

'అయితే, నీవు ఈ ఎలుక రూపంలోనే నాకు వాహనంగా ఉండటం నా అభిలాష' అన్నాడు గణేశుడు. 'గణేశా!—ఇంత కన్న నాకు కావలసిందేమున్నది? తరుణోపాయమైనటువంటి మాట చెప్పావు. ధన్యుణ్ణయిపోయాను,'' అంటూ గజముఖుడు తన సంతోషాన్ని వెలిబుచ్చాడు.

దుష్టుడైనటువంటి గజముఖుణ్ణి చిత్తు చేసి వినాయకుడు మరలివస్తున్నాడనే వార్త తెలియగానే, ఆయన్ని స్తుతిచేయడం కోసం దేవేంద్రాదులందరూ కైలాసానికి వచ్చి గుమ్మంవద్ద కాచుకొని వున్నారు.

అప్పుడు నందికేశ్వరుడు దేవతలతో "మీరు గణపతి ఎదట స్తోత్రాలూ గీత్రాలూ పఠించితే ఆయన ఇష్టపడడు. నిశ్శబ్దంగా ఒక్కొక్కరే దర్శనం చేసుకొని భక్తిపూర్వకంగా మూడేసి గుంజీలు తీసి, మూడేసి మొట్టికాయలు కొట్టుకొని, మూడు మార్లు లెంపలు వాయించుకోవాలి. వినాయకుడు సంతోషించాలంటే ఇదే మీరు చెయ్యాల్సిన పని,'' అని చెప్పాడు.

ఇందుకు వారు గుంజీలు మొట్టికాయలు ఇప్పటికీ తప్పలేదే? అని ఆశ్చర్యపోయారు. అప్పుడు—ఇందులోని అంతర్యం తెలిసిన కొందరు తెలివిమంతులు "ఓయి అబ్బాయిలూ!—ఆ గుంజీలకీ ఈ గుంజీలకీ తేడా లేదా? బలిమిని తీసిన గుంజీలు అవి. భక్తితో తీసే గుంజీలు ఇవి. గజముఖుడంటే సామాన్యుడుకాడు. ఈశ్వర భక్తుడు. అందుకనే గణేశుని కటాక్షం పొంది ఆయనకు వాహనమై కూర్చున్నాడు." అని చెప్పగానే, దేవతలందరూ ఆనందంతో మూషికవాహనుడైన గణపతి పైన పుష్పవర్షం కురిపించారు. నాటినించీ గణపతి విగ్రహంముందు గుంజీలు తీసి, మొట్టికాయలు కొట్టుకుని లెంపలు వేసుకోవటం దేవలోకంలోనూ భూలోకంలోనూ కూడా పరిపాటి అయింది.



# ఎందుకో తెలుసా?

## పాముకి గరుడపక్షికి వైరం....



అనగనగా పుణ్యకోటి అనే ఒక వేటకాడు ఉండేవాడు. అతను గొప్ప విష్ణుభక్తుడు. ఒకప్పుడు పుణ్యకోటి వేటకు పోయి నెల్లాళ్ళకైనా ఇంటికి రాలేదు. ఇదేసమయమని చెప్పి, పాతాళలోకంలో ఉండే నాగరాజు పుణ్యకోటి ఇంటికి వెళ్ళి, ఒంటిపాటుగా వున్న అతని భార్యను రథం మీద ఎక్కించుకొని తన కోటకు తీసుకపోయాడు. అక్కడ, తన మంత్రశక్తివల్ల ఆమెను ఒక పాముగా మార్చివేశాడు.

కొంచెం సేపటికల్లా ఆడుకోబోయిన పిల్లవాడు ఇంటికి వచ్చి వెతుక్కున్నాడు. తల్లి కనపడలేదు. చేసేది లేక గోలపెడుతూ అడవులుపట్టి పోయి ఒక మర్రిచెట్టుకింద చతికిలబడగా, అక్కడ పెద్ద పుట్ట కనిపించింది. వాడు ఆపుట్టలోకి దుమికాడు.

పిల్లవాడు ఎలానో నాగలోకం చేరుకున్నాడు. ఆ లోకంలో ఎక్కడ చూచినా పాములే కాని, మానవమాత్రులు లేరు. అందుచేత భయపడి అలాగే పోతుండగా కొన్ని పాములు అడ్డువచ్చి, మానవ కంఠంతో వానిని ప్రశ్నించినై. పాములేమిటి యిలా మాట్లాడటమేమిటి అని పిల్లవాడు ఆశ్చర్యపోతూ—తన తల్లిజాడ చెప్పగలరేమో అని అడిగాడు.

అందుకు నాగులు జాలిపడి, "అబ్బాయీ, ఇవాళ ఉదయం మా నాగరాజు ఒక స్త్రీని తీసుకురావటం మాత్రం చూచాము. కావాలంటే రాజు కోటకిదారి చూపుతాం. కాని ఆమెని పాముగామార్చి వేశాడే, కనుక్కొగలవా ?" అన్నారు.

అందుకు పిల్లవాడు—"నాకు కోటకి దారిచూపండి, నాగరాజుని బ్రతిమాలి నా తల్లిని కలుసుకుంటాను" అన్నాడు.

సరేనని నాగులు, పిల్లవానికి నాగరాజు కోటకి దారిచూపారు. వాడు కోటలోఅడుగు

ఈ నెల బహుమతి పొందిన కథ — డి. వి. జగన్నాథం, శికింద్రాబాదు

* బహుమతిగా సెప్టెంబరు '50 నుంచి ఫిబ్రవరి '51 వరకు 'చందమామ' పంపబడుతుంది.

పెట్టగానే సర్ప రూపంలోవున్న అతని తల్లి, గబగబ ఎదురువచ్చింది. ఇది చూచి నాగ రాజు వానినికూడా పాముగా మార్చివేశాడు. తల్లీ కొడుకూ ఇలా పాములైపోయి నాగ రాజు కోటలో వుంటున్నారు.

ఇంతలో అక్కడ పుణ్యకోటి—ఇంటికి వచ్చి చూచుకొనేసరికి భార్యా లేదు, కుమారుడూ లేడు. పుణ్యకోటి యోచించాడు. రథచక్రాల జాడ అగుపించింది. ఆ జాడ వెంబడే వెళ్ళగా అరణ్యం, అరణ్యంలో మఱ్ఱిచెట్టు, మర్రికింద పెద్ద పుట్ట కనబడినై. గభీమని ఆ పుట్టలోకి దుమికి నాగలోకం చేరుకున్నాడు.

అతనిని చూడటంతోటే నాగరాజు పరుగున వచ్చి అతనితో యుద్ధానికి తల పడ్డాడు. ఇద్దరికీ తీవ్రయుద్ధం జరుగుతున్న సమయంలో సర్పరూపంలోవున్న పుణ్యకోటిభార్య, కుమారుడూకూడా పరుగునవచ్చి అతనికాళ్ళకు చుట్టుకున్నారు. వాళ్ళు తనభార్య, కుమారులే అనిగ్రహించి, పుణ్యకోటి తన ఇష్టదైవమైన విష్ణువును తలుచుకుని వాళ్లని తాకేసరికల్లా వాళ్లు గరుడపక్షులుగా మారిపోయారు.

'వీడెవడో అసాధ్యుడిలా వున్నాడే' అని ఆశ్చర్యంతో చూస్తుండగా పుణ్యకోటికూడా ఒక గరుడపక్షిగా మారిపోయి నాగరాజుని తన వాడి గోళ్ళతో పట్టుకోబోయాడు. కాని కనురెప్పపాటులో నాగరాజూ, నాగులూ కూడా మాయమైపోయారు. వీళ్ళు బైట పడకపోతారా అని పుణ్యకోటి, పక్షి రూపంతో అక్కడనే కొన్నాళ్ళు వుండి పోయాడు. కాని ఎంతకీ బైటికి రాలేదు. అప్పుడు పుణ్యకోటి "నీదుర్మార్గానికి తగిన శాస్తి చేసేవరకూ నేను నిద్రపోను?" అని శపథంపట్టాడు. గరుడపక్షుల రూపంతోనే తనూ, కుటుంబమూ నాటినించీ పాములను వెతికి వెంటాడి కబళించటం చేత వాటిమధ్యని జాతివైరం ఏర్పడింది.



# చందమామ బొమ్మల పజిలు





# పిల్లల పెంపకం

తల్లులకు మాత్రము

## ఫలజాతులు - విశేషాలు

ఆహారం విషయంలో తెలుసుకోవలసిన సంగతులు అనేకం వున్నాయి. అందుకనే ఈసారి ఫలాలను గురించి మరికొన్ని వివరాలు చెబుతున్నాను:

బిడ్డల శరీరపుష్టికి లోహాలు కలిసినటువంటి పదార్థాలు ఇవ్వటం అవసరం. రక్త వృద్ధికి లివర్ ఇస్తే పనిచేస్తుందనీ, పాల ఆహారంవల్ల ఎముకలు ఎదుగుతాయనీ చాలా మందికి తెలుసు. కాని, ఖర్జూరంలోనూ చింతపండులోనూ ఇనుము ఎక్కువగా వుంటుందని అట్టేమందికి తెలియదు. మామిడిపళ్లు, యాపిల్సు, అత్తిపండ్లు, నేరేడు— వీటిల్లోకూడా ఇనుములోహం ఎక్కువే. వెలగ, నారింజ జాతులు, పనస—వీటిలో సున్నం (కాల్షియమ్) మిక్కుటంగా వుంటుంది. పెద్ద ఉసిరిక 'సి' విటమినుకు పెట్టింది పేరు.

పండ్లు ఎప్పుడూ చెట్టున పండినవే తినటం శ్రేష్ఠం. పక్వానికి రాని పండ్లు తింటే మేలుచేయటానికి బదులు అజీర్ణం కలిగించవచ్చు.

బలకరమైన పదార్థాలు పండ్ల లోపలి గుంజుకే కాకుండా పైన పెచ్చుకికూడాపట్టి వుంటాయి. కనుక, వీలునుబట్టి టొమాటో, యాపిల్సు మొదలైన వాటిని పెచ్చు తీయకుండా అమట్టునే తినివేయటం మంచిది.

ఫలజాతులు ఆరగించేటప్పుడు వాటిలో చక్కెర వేసుకోకూడదు. తయారైన చక్కెరలో ద్రావకాలు (యాసిడ్సు) మిళితమై ఉండటంవల్ల, అది కలిస్తే, ఫలాలకు ఉండే సుగుణాలు మాయమైపోయి, ఒక్కొక్కప్పుడు వికటించవచ్చు కూడా.

కొంతమంది కేవలమూ ఫలాలమీదనే జీవిస్తామంటారు. కాని, మానవుని శరీర పుష్టికి ఒక్క ఫలాలుతింటే చాలదు. మాంసకృత్తులు, క్రొవ్వు, లోహాలూ, లవణాలు, విటమిన్లు మొదలైన రకరకాల పదార్థాలు అవసరం. ఇవి అన్నీ ఉండే ఆహారం తినాలి. ఇందులో ఏది తక్కువైనా పూర్తిఆహారం కాదన్నమాట. కాబట్టి భోజనం చేసినతరువాత, 2 ఔన్సుల బరువుగల ఫలాలు తింటే మామూలు మనిషికి సామాన్యంగా సరిపోతుంది.

'మీ పెద్దమ్మ'



యస్. సుశీల, రాణీబెన్నూరు



పి. రాజరాజేశ్వరి, బందరు



పి. వి. రత్నం, కాకినాడ




## మరొక చిత్రమైన పేక ట్రిక్కు

ఇప్పుడు చెప్పబోయే ట్రిక్కు చాలా తేలికైనది. అంతేకాదు. పేకముక్కల్ని మీరు ఇంటిదగ్గర తయారుచేసి తెచ్చుకోనక్కరలేదు. ప్రేక్షకులలో ఎవరిదగ్గరవున్న పేకతోనైనా మీరు ఈట్రిక్కు చేయవచ్చు.

సభకువచ్చిన, ప్రేక్షకులలో ఎవరిదగ్గరనైనా పేకవుంటే అడిగి తీసుకో. తర్వాత మరెవరినైనా ఆపేకలోనించి తొమ్మిది ముక్కలో పది ముక్కలో తియ్యమను. అప్పుడు నువ్వు ఆ తొమ్మిది ముక్కలలో ఒకముక్క నీఅరచేతిలో పెట్టుకుని ప్రేక్షకులను చూపించు. తక్కిన ఎనిమిది ముక్కలుకూడా తీసుకుని, అరచేతిలో వుంచిన ముక్కకి అడుగున చుట్టూ దూర్చి నక్షత్రం ఆకారంగా కనిపించేటట్టు చెయ్యి. ఆ తర్వాత, ఖాళీగావున్న రెండో చెయ్యి ముక్కలున్న అరచేతిచుట్టూ తిప్పుతూ ఏదో మంత్రం చదువుతున్నట్టు నటిస్తూ ముక్కలున్న నీ అరచేతిని బోర్లగా తిప్పాలి. చిత్రం! ఒక్క ముక్క కూడా క్రిందపడదు. ప్రేక్షకులు · ఆశ్చర్యంతో చూస్తుంటారు. అలా కాసేపు చూడనిచ్చి తిరిగి ముక్కల్ని ప్రేక్షకునికి తిరిగి



యిచ్చెయ్యి. ఏదో మంత్రశక్తివల్ల యిలా చెయ్యగలిగావని ప్రేక్షకులు అనుకుంటారే కాని అసలుకిటుకు ఎవరికీ తెలియదు. ఆ కిటుకు యిది:

సభకి వచ్చేముందుగానే నువ్వు నీ అరచేతికి మధ్యగా ఒక వెంట్రుక కట్టుకురావాలి. ఇందుకు ఎంత పరీక్షగా చూచినా ప్రేక్షకులకి కనుపించనంత సన్నగావుండి అరచేతి రంగులో కలిసిపోయేటటువంటి వెంట్రుక సంపాదించాలి. సభకి వచ్చాక

ప్రేక్షకుడి దగ్గరనుంచి తీసుకున్న తొమ్మిది ముక్కలలోని మొదటి ముక్కను ఈ వెంట్రుకకీ అరచేతికీ మధ్య దూర్చాలి. ఇది ఎలా వుండాలో మొదటి బొమ్మలో చూడు. మిగతా ఎనిమిది ముక్కలూ ఈ ముక్కకి అడుగున దూర్చినప్పుడు ఎలా వుండాలో క్రింది బొమ్మలో వుంది చూడు. ఇలా ముక్కల్ని పేర్చినతర్వాత మొదటి



ముక్క పడిపోకుండా వుండటానికి వెంట్రుక ఆధారంగా వుంటుంది. మిగతా తొమ్మిది ముక్కల్ని మొదటిముక్క నొక్కి పట్టి వుంటుంది. ఇదే కిటుకు.

[పాఠకులు, ఈ గారడినిగురించి సలహాలను పొందదలిస్తే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషులోనే వ్రాయాలి. వారి అడ్రసు యిది:—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజిషియన్,
పోసుబాక్సు 7878, కలకత్తా—12.]

## మిఠాయి పాట

"మహేశ్వర్", (మద్రాసు)

తీయని తీయని బెల్లాలోయ్
తేనెలు ఊరిన పాకాలోయ్
కొబ్బరి పత్రిని కొంటారోయ్!

కమ్మని వాసన జిమ్మేయోయ్
గుమ్మగ చేసిన కోవాలోయ్
తింటే నోరులు ఊరాలోయ్!

తాజా తాజా కాజాలోయ్
చిక్కని చక్కెర పాకంనిండా
కమ్మని తియ్యని కాజాలోయ్!

గమగమలాడే లాడూలోయ్
గమ్మున తింటే గుమ్మగనుండే
రమ్యమైన రవలాడూలోయ్!

కరకరలాడే కజ్జాలోయ్
సజ్జనేతిలో వేచారోయ్
నోటను పెడితే కరగాలోయ్!

వేడి వేడిగా కిచిడీలోయ్
పిలిచిన పలికే పరిమళమోయ్
జీడిపప్పు సువాసనలోయ్!

కమ్మని వాసన గుమ్మగ వేసిన
తీరుగ చేసిన తీపిమిఠాయ్!
బాదంహల్వా బాసంతీలు
గప్‌చిప్ మిఠాయ్ కావాలోయ్!

# వయస్సూ, పుట్టిననెలా చెప్పటం ఎలాగ?

నీ స్నేహితుడిని అతను ఏనెలలో పుట్టాడో అది ఎన్నోనెల అయితే ఆ అంకె వ్రాసుకోమను. (జనవరిలో పుట్టివుంటే జనవరి 1-వ నెల కనుక 1 వ్రాసుకోవాలి. అక్టోబరు 10-వ నెల కనుక 10 వ్రాసుకోవాలి) పుట్టిన నెల సంఖ్య రాసుకున్నాడు కదా? దానిని 2 చేత గుణించమను. వచ్చిన సంఖ్యకి 5 కలపమను. కలపగా వచ్చిన సంఖ్యని 50 చేత గుణించమను. ఇప్పుడు వచ్చిన సంఖ్యకి అతని వయస్సెంతో ఆసంఖ్య కలపమను. కలపగా వచ్చిన సంఖ్యలోనించి 365 తీసివెయ్యమను. తీసివెయ్యగా వచ్చిన సంఖ్యకి 115 కలపమను. ఇలా కలపగా వచ్చిన సంఖ్య ఎంతో నీకు చెప్పమను.

ఈ సంఖ్యనిబట్టి అతని వయస్సెంతో అతను ఏనెలలో పుట్టాడో నువ్వు వెంటనే చెప్పవచ్చు.

ఉదాహరణకు నీ స్నేహితుడి వయస్సు 12 అయి, అతను ఏప్రిల్‌లో పుట్టాడనుకో. అప్పుడు అతను మొదట వ్రాసుకోవలసింది యిలాగ:—

| | |
|---|---|
| అతను పుట్టిన నెల సంఖ్య | 4 |
| 2 చేత గుణించితే | 8 |
| దీనికి 5 కలిపితే | 13 |
| దీనిని 50 చేత గుణించితే | 650 |
| దీనికి ఆతనివయస్సు కలిపితే | 662 |
| దీనిలోంచి 365 తీసివేస్తే | 297 |
| దీనికి 115 కలిపితే | 412 |

నీ స్నేహితుడు ఈ లెక్క మొదటినించీ నీకు కనుపించకుండా వేసుకుని చివరకుమాత్రం 412 అని చెబుతాడు. మొదట వున్న అంకె అతను పుట్టిన నెలా తరవాత వున్న అంకె అతని వయస్సూ తెలుపుతుంది. ఇప్పుడు మొదటి అంకె 4 కనుక ఆతను పుట్టింది ఏప్రిల్‌లో అనీ, తరవాత అంకె 12 కనుక ఆతని వయస్సు 12 అనీ చెప్పవచ్చు. కాని, ఒకవిషయం: 10 సంవత్సరాలలోపు వయస్సు వాళ్ళ విషయంలో జవాబులో పుట్టిన నెల తెలియచేసే సంఖ్యకీ, వయస్సు తెలియచేసే సంఖ్యకీ మధ్య సున్నా వస్తుంది. ఎలాగంటే పుట్టిన నెల మే (5) అయి, వయస్సు 9 సంవత్సరాలే ఐతే జవాబు 509 అని వస్తుంది కాని 59 అని రాదు.

## మాటల చదరం

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | కు | | | | |
| 2. | | కు | | | |
| 3. | | | కు | | |
| 4. | | | | కు | |
| 5. | | | | | కు |

ఈ క్రింద యిచ్చిన అధారములతో పై చదరం పూర్తిచెయ్యండి. పూర్తిచెయ్యలేకపోతే జవాబు ఈ పేజీలోనేచూడండి.

1. ప్రపంచము
2. పొగడ దండ
3. పలనాటి వీరవనిత
4. విఘ్నేశ్వరుడు
5. తాంబూలానికి పనికివచ్చేది

బొమ్మల పజిలుకి జవాబు :

| అడ్డము : | నిలువు : |
|---|---|
| 1. అంక | 1. అంబు |
| 3. మేనా | 2. కలాపి |
| 5. బులాకి | 3. మేరువు |
| 6. మారుతి | 4. నాతి |
| 9 పాదము | 7. మేదరి |
| 10. గొలుసు | 8. ఎలుక |
| 12. కరి | 9. పాక |
| 13. కత్తి | 11. సుత్తి |

## "ఎందుకో తెలుసా?"

'గరుడపక్షికీ పాముకీ వైరం' గురించి మాకు వచ్చిన కథలలోకెల్లా ఉత్తమంగా ఉన్న కథని ఈ సంచికలో వేశాం. ఈ కథను వ్రాసినది డి. వి. జగన్నాథం, శికింద్రాబాదు. వీరికి బహుమతిగా సెప్టెంబరు 50 నుంచి ఫిబ్రవరి 51 వరకు 'చందమామ' ఉచితంగా పంపుతున్నాం.

వచ్చేనెల (అక్టోబరుకు)

"వడ్రంగిపిట్ట ముక్కు చాలా పొడుగ్గా ఉంటుంది" ఎందుకో తెలుసా?

అనే విషయాన్ని గురించి మీకు తెలిసిన కథ వ్రాయండి. క్రిందటినెల చాలా మంది 5, 6, పేజీల కథలు వ్రాసి పంపారు. అలా కాకుండా రెండు పేజీలకి మించకుండా కథ వ్రాసి పంపండి. కథలు సెప్టెంబరు 15-వ తేదీలోగా చేరేటట్టు ఈ అడ్రసుకు పంపండి.



"కథల తాతయ్య"

చందమామ ఆఫీసు

పోస్టుబాక్సు 1686, మదరాసు-1

వినోద చదరానికి జవాబు :

1. కువలయము ; 2. వకుళమాల ; 3. నాయకురాలు ; 4. వినాయకుడు ; 5. తమలపాకు.




బొమ్మకి రంగులు వెయ్యండి. మీరు రంగులువేసిన బొమ్మని వచ్చేనెల (అక్టోబరు) చందమామ అట్టమీది బొమ్మతో పోల్చుకోండి.

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press, Madras-1

